

సాహిత్య మాస పత్రిక

# 360

ఏప్రెల్, 1984 సంపుటి : 31, సంచిక 1

వార్షిక చందా : పదిహేను రూపాయిలు విడిప్రతి · రూపాయిన్నర

ప్రకాశకులు :

దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర

హైదరాబాదు



ది. 7-2-84 తేదీన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఎడ్యుకేషనల్ ఆఫీసరు
డా॥ బి. సాయిలు ఎం. ఎ; ఎం. యిడి; గారు హిందీ
ప్రచారక విద్యాలయం సందర్శించినప్పుడు ఉపాధ్యాయులు
హిందీ ప్రచారక విద్యార్థులతో తీయబడిన ఛాయాచిత్రం.

కుర్చీలలో-సర్వశ్రీ యన్. యస్. ఆచార్యులు, డా॥ బి. సాయిలు
బో॥ నాగేశ్వరరావు, బో॥ సుభద్రాదేవి, యస్. టి. వసంత(ప్రిన్సిపాల్)
పి. భారతి, యన్. లావణ్యవతి.

# ఈ సంచికలో


| | |
|---|---|
| 1. సంపాదకీయం | |
| 2. నిరీక్షణ | జి. సోమశేషు. |
| 3. తారా సాంత్వనము | డా. బి. వి, కుటుంబరావు. |
| 4. నరుడు + నారి = ఔశీనరుడు | కె. స్వర్ణలత. |
| 5. మార్పులేని పాట | సూర్యదేవర రవికుమార్ |
| 6. పట్టెడన్నం పెడుతున్న-వాడు | తిరునగరి. |
| 7. వేమన దృష్టిలో 'స్త్రీ' | ఆర్. పురుషోత్తమరావు |
| 8. ప్రకాశం జిల్లాలోని కొన్ని మాండలికములు | విద్వాన్ దేవులపల్లి విశ్వనాథం. |
| 9. వరహోభిక్ష | పైడిపాటి రామశాస్త్రి. |
| 10. పౌరాణిక ఇతివృత్తాలలోని అర్థగాం | డా॥ జి. ఉషాలావణ్య. |
| 11. ఆబ్సర్డ్ నాటకాలు—1 | శ్రీ వేమూరి ఆంజనేయశర్మ. |
| 12. సాహిత్యగోష్ఠి | ఆర్. వసునందన్. |
| | డా॥ ఉషాలావణ్య |
| 13. సమీక్షలు | నాగపద్మినీ; వేముగంటి, |
| | తంగిరాల |
| 14. వార్తావాహినీ | |

# శ్రీ ఆచార్య దేవులు

దక్షిణ భారతావనిలో హిందీకి జీవితమంకితము చేసిన మహామహులలో శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తిగారు తలమానికము వంటివారు. స్వామి సీతారాంగారు, దేశభక్తకొండా వెంకటప్పయ్య పంతులుగారు, ఆంధ్ర కేసరి టంగుటూరిప్రకాశం పంతులుగారు, పూజ్య వినోబాగారు, మహాత్మా గాంధీ గారల ఆశీః ప్రభావంతో వారి హిందీప్రచారం, చైతన్యవంతమై తెలుగు నేల నాలుగు చెఱగుల ప్రసరించింది.

శ్రీ వేమూరి ఆంజనేయశర్మగారి దగ్గర వారు విద్యనార్జించినారు. స్వాధ్యయనము వారి సహజ ప్రవృత్తి. వారు బద్ధకమునకు విరోధులు, పరిశ్రమశీలురు, పెద్దల సాంగత్యమున గొప్ప అనుభవమునార్జించినవారు.

నేటికి ౬౫ సంవత్సరముల పూర్వము దక్షిణ భారత హిందీప్రచార సభలో ప్రవేశించి, హిందీ మహావిద్యాలయాలలోను, హిందీప్రచారక విద్యాలయాల లోను ప్రధానాచార్యునిగా వేలకొలది యువతీ యువకులకు హిందీ నేర్పినారు. అదిగాక, వారుసంగఠకులుగా హిందీ ప్రచార మహాసభలు, జిల్లా హిందీ మహా సభలు, జరిపి హిందీవ్యాప్తికి దోహదం చేశినారు. ఎన్నో సభలు, సమావేశాల్లో భాషించిప్రజాహృదయమును జాతీయ భాషవైపుకు మరలించినారు. ఇంతేకాక శ్రీవినోబా భావే, శ్రీ రాష్ట్రపతి జ్ఞానీ జైల్‌సింగ్ మొదలగు పెద్దల హిందీ ఉపన్యాసములను తెలుగులోనికి ఆశువుగ అనువాదము చేసినారు.

తెలుగు-హిందీ భాషలలో ఎన్నో గ్రంథములను రచించి వారు సన్మాన ములను స్వీకరించినారు. రచయితగవారికి గొప్పరాణింపు వచ్చినది. తెలుగు సాహిత్య అకాడమి తరపున సమ్మానితులైనారు. విశ్వతెలుగు సమ్మేళనము, విశ్వ హిందీ సమ్మేళన సందర్భముగ మలేషియా మారిషస్‌కు ఆహూతులై వెళ్ళి అచటివిశేషములను గ్రంథరూపమున వెలువరించినారు.

దక్షిణ భారత హిందీ ప్రచారసభలో వారు చేరిన తర్వాత హిందీప్రచారం వాడి-వేడినందుకున్నది. హిందీ పరీక్షార్థుల సంఖ్య ఉత్తరోత్తర వికాసం చెందినది. హిందీప్రచారసభ ఆవరణలో భవన నిర్మాణం జరిగినది. ''పూర్ణకుంభ'' హిందీ పత్రిక వెలువరింపబడినది. సభలు-సమావేశములద్వారా హిందీప్రచారకులకు తగిన ప్రోత్సాహం ఉత్సాహం లభించినది. తద్వారా హిందీ ప్రచారం చైతన్యవంతమైనది.

ప్రస్తుతంవారు దక్షిణ భారత హిందీప్రచారసభ నుంచి తప్పుకొని, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రియైన శ్రీ N. T. రామారావుగారికి హిందీ విషయంలో సహకరిస్తున్నారు. జాతీయభాష అగు హిందీ ప్రచారయాత్రలో శ్రీ రాధాకృష్ణమూర్తిగారికిది 36వ మైలురాయి. భారత జాతీయోద్యమములో ఇదొక శుభపరిణామము. ఏలన, నేటి 36 ఏండ్లనాడు శ్రీ స్వామిసీతారాం గుంటూరులో ఆంధ్ర రాష్ట్రం కోసం నిరాహారదీక్ష పూనినారు. అపుడు శ్రీరాధాకృష్ణమూర్తిగారు కొంతమంది తెలుగు యువకులను వెంటనిడుకొని, గ్రామ గ్రామమున సభలు-సమావేశాలు జరిపి, తెలుగు యువతను తట్టి, జాగృత మొనరించిన అచ్చ తెలుగువారు. శ్రీ రామారావుగారు మూర్తీభవించిన తెలుగు భాషాసంస్కృతి, సభ్యతలకు రూపెత్తిన పుష్పరాశివంటివారు అట్టివారికి జాతీయ భాషయైన హిందీనినేర్పి భారతదేశైక్యతకు వారిని అంకితం కావించునట్లు చేయుట ముదావహము. ఈ పరిణత దశలో, శ్రీ రాధాకృష్ణమూర్తిగారు తెలుగుదేశంలో పెద్దలకు జాతీయభాషారుచులు అందజేయు మహదనుష్ఠానములో నిర్విరామ కృషిచేయాలని అభిలషిస్తున్నాము. ఈ కృషి ఫలితము ఆంధ్రికి, భారతికి, మహోన్నత వెలుగురాజియై విలసిల్ల గలదని విశ్వశిస్తున్నాము.

శ్రీ తం। వెం। సుబ్రహ్మణ్య శాస్త్రి
కార్యవాహీ సచివ్
దక్షిణ భారత హిందీ ప్రచారసభ ఆం. ప్ర.

# ని ణ

-జి. సోమశేషు

బ్రతుకొక అనంతమైన నిరీక్షణ
అడుగడుగునా నిరీక్షణ;
ఉదయాన పాలకోసం
తర్వాత పేపరు కోసం, బస్సు కోసం
చదువుల్లో సీట్ల కోసం
పరీక్షల్లో ఫలితాల కోసం
ప్యాసవగానే ఉద్యోగాల కోసం
ఆ తరువాత ప్రమోషన్ల కోసం
ఆఫీసుల్లో అధికారుల దయకోసం
గుమాస్తాల కృపా కటాక్షాల కోసం
అటు పిమ్మట సంతానం చదువుల కోసం
తరువాత వారి పెళ్లిళ్ల కోసం
ఇట్లా తలాతోకా లేని కథలా
చర్విత చర్వణ మయ్యే సమస్యల
ఘర్షణలో పరిష్కారాల కోసం,
బజార్లో రేషన్ల కోసం
ప్రయాణాల్లో బస్సుకోసం, రైలుకోసం
ఆసుపత్రుల్లో వైద్యుల కోసం
కోర్టులలో తీర్పు కోసం
మున్సిపాలిటీలలో పర్మిషన్ల కోసం
గుళ్ళల్లో దైవదర్శనం కోసం
బ్యాంకుల్లో అప్పుల కోసం
ఇరుగు పొరుగు వారికి
మనమిచ్చిన అరువుల కోసం
ఇలా వేచి, వేచి, విసిగి, వేసారి
ఇలా వేదనలో నలిగి, నలిగి—
మోక్షం మాట దేవుడెరుగు—
ఆఖరికి బాధా విముక్తి కలిగించే
మృత్యువు కోసమైనా
నిరీక్షణ—అంతులేని నిరీక్షణ

1-4-97,
జిరాయత్ నగర్,
ఆర్మూరు,
నిజామాబాదు జిల్లా
503224

# తారా సాంత్వనము

—డా॥ వి. వి. కుటుంబరావు

విన్ముత్రోవన్ వెలుగొంది యుంది తుద కుర్విన్ రాలు నాతారఁ బో
లిన యీతారను నేలఁగూలుటఁ గనెన్ లెయ్యంబునన్ లియ్యమా
నని లాంగ ప్రభవుండు, పింగ తతి హార్యక్షుండు; నెట్లైన నా
మెను నూరార్పఁగఁ గోరి యిట్టు లనె నెమ్మిం దాను; రామప్రభూ!

వనితారత్నమ! యేడ్తు వెందులకు? నేడ్వన్ వద్దు: జ్ఞానంబువ
ల్లనో! యజ్ఞానమువల్లనో! జగతి సర్వప్రాణులున్ బుణ్య పా
ప నిమిత్తం బగు కర్మముల్ సలుపుటల్ భావ్యంబు; తత్తద్ఫలం
బనుభూతం బగు; నంతే; యం చనియె నొయ్యం దాను; రామప్రభూ

3

సరవిం జేసిన పుణ్య పాప ఫల భోజ్యం బారగింపంగనై
పరలోకాగతి గల్గుఁ బ్రాణుల, కవార్యం బౌటచే నద్ది; యొ
క్కరికై యొక్కరి దుఃఖ మేల? నిఁక నీకై గాక నీ వాడ్లకై
పరితాపించిన లాభ మేమి; యనెఁ గప్యగ్ర్యుండు; రామప్రభూ!

4

అనదం బోలినదాన వైతి విపు; డత్యంతంబు కారుణ్య కా
రణమై యెవ్వరికోస మేడ్చెదు? శరీరం బెప్పుడున్ బుగ్గ నా
విన వే? దీనికి నొక్కరిన్ గుఱిచి దేవి! యొక్క రేడ్వంగఁ బో
లునె? నీ ర్బుగ్గలె మేను లెల్ల, నని తెల్పెం దాను; రామప్రభూ!

5

తనయుం డుండెను నీ కొకండు; గనుకన్ దత్పుత్త్రినిం జూచుకొం
చును నుండన్ దగు; ముందుముం దతనికిన్ గూర్పంగనౌఁ గార్యముల్
మనసా జూడుము; రాక పోక లిల సర్వప్రాణి సామాన్యమై
కనుచుండుంగద! యస్తిరత్వ మనె నుకాలంబు; రామప్రభూ!

వినుమో! దేవి! విదగ్ధవీవు; తెలుపన్ వే ఱవ్వ రున్నార లిం
దున నీకున్? విలపింపరా దిపుడు ముం దున్నట్టి కార్యంబుఁ జిం
తన చేయన్; బర లోక సౌఖ్యములు చెందం బ్రేత కార్యంబు లె
ల్లను నీభర్తకుఁ జేయఁజూడుము; మనె నల్లం దాను; రామప్రభూ!

లలనా రత్నమ! నీదు భర్త కపులన్ రాజ్యంబులో నర్బుదం
బుల సంఖ్యం గల యెల్లవారలను దాఁ బూర్వంబె సౌకర్యమి
మ్ములఁ గల్గన్ విభజించి, యందఱు సుఖంబుం గూర్చి యేర్పాటులన్
సనిపెన్ బుణ్యుఁ; డలుంచు నానిలి ప్రశంసల్ సేసె; రామప్రభూ!

చనెఁ గాలం బది తీఱిపోవుట; సమస్తంబైన శాస్త్రంబులన్
గనె; నాతం డల తత్త్వవేత్త: తెలియంగా సామ దానక్షమా
గుణ సంపన్నుఁడు; పుణ్యు లేఁగు జగముల్ గొం పోచుఁ బోనుండె; నా
తనికై క్లేశ మయుక్త మం చనియె వాత జ్యోతి: రామప్రభూ!

వనటం బొందకు; తాపమున్ విడువుమీ! భామామణీ! నీదు బ్రాఁ
పున నీ యంగదుఁ డేలు రాజ్య రమనున్; బుత్త్రిందు నీ కున్న కా
రణమున్ బట్టి, తలంపు మేది మును సల్పన్ యుక్తమో యిప్పు, డం
చని కర్తవ్యము బోధ చేసి హానుమం డాపైన; రామప్రభూ!

10

వికలుం డంగదుచేత నీపతికిఁ దన్వీ తల్లజా! యౌర్ధ్వ దై
హిక కర్మంబులు సల్పఁజూడవలె నీవే! ప్రేత సంస్కార పూ
ర్వక కార్యంబులు సన్న పిమ్మట, నిఁకన్ రాజ్యాభిషేకంబు వా
నికిఁ జేయింపు; మటంచు నా హనుమ తన్విం దేర్చె; రామప్రభూ !

11

చెమరింపం గనుదోయి, యంగదుఁ డటుల్ సింహాసనం బెక్కుచోఁ,
గొమరున్ నిత్యముఁ జూచుకొంచుఁ గడపన్, గొన్నాళ్ళలో సర్వథా
శ్రమముల్ దీఱును నీకు; దుఃఖమును గాల క్రాంతి సంయుక్తితో
శమియించుం జుమి! యంచుఁ భావని సమాశ్వాసించె; రామప్రభూ!

12

హనుమం డిట్లని యన్నమాటలను శ్రద్ధాసక్తిమై వించుఁ దీ
అని భర్తృవ్యసనంబు నొందియును దారా సాధ్వి, 'వే మంది యు
న్నను సూనుల్, బతి కూర్చు కౌఁగిలియె మిన్నౌ నాకు నీపృథ్విలో
హనుమా!' యం చనెఁ, బట్టరాని తమిలో నల్లాడి; రామప్రభూ!

13

ఘన బాహుం డగు వాలికిన్ దహన సంస్కారాదిఁ జేయించుటల్
దనయున్ రాజ్యమునందు నిల్పుటలు, సేఁతల్ నావిగా వంజనీ
తనయా! దానినిఁ బిన్నతండ్రి తలఁపన్ ధర్మంబు, కన్నయ్య లే
మిని నాతండె సమస్త మౌట; నని తెల్పెం దార; రామప్రభూ

14

హనుమా! యంగదు ప్రస్తవంబునను జేయన్ యోజనన్ నాకు నే
పనియున్ లేదు; పితృవ్యుఁడే సకలమున్ భారంబు మోయం జనున్;
దనయక్షేమ కరుండు తండ్రియగుఁబో! త్రాయంతి గా దెన్నఁడున్;
గనుకన్ సూర్యజుఁ డెల్లఁ జూచు ననియెం గ్రాల్గంటి; రామప్రభూ!

15

క్రమ, మిందుం బరమందు నైనఁ బతి వర్త్మం బందునం బోక, పెం
డ్లము లెవ్వారికిఁగాని; వాలి హతుఁడౌటన్ సమ్ముఖుం డౌచు దుః
ఖములో నుండెను; వాని వెంటఁ జనుటే కార్యంబు ప్రాయోపవే
శముచే; నంచును దార తెల్పెఁ దన నిష్కర్షంబు; రామప్రభూ!

రామాయణేంద్ర ధనుస్సు-[కిష్కింధా కాండము-ఏక వింశస్సర్గము నుండి:-]

1-9-295/13/ఎ/2
విద్యానగర్,
హైదరాబాదు. 500044.

# నరుడు + నారి = ఔశీనరుడు

కె. స్వర్ణలత

ఫాలం కపాలం ఒకటి కావు.
కపాలంలో భాగం ఫాలం.
నరనారులు లోకంలో ఒకటి కారు.
నారిలో ఒక భాగం నరుడు.
నరుడే నారికి వానరుడు
వానరుడే నారికి వారసుడు
వారసత్వం కోసం ఔరసుడు
ఔరసు డయ్యాడా సరసుడు
లోకానికి అతడే ఔశీనరుడు.

# మార్పు లేని పాట

—సూర్యదేవర రవికుమార్

చదువు నమ్ముకొని సీటుకంటుకొని
చదివిన చదువుకు ఫలమింతేనని
జీతం రాళ్ళతో కుటుంబ భారం
సరిపడ తూచే ఎన్జీవోలు
శ్రమను నమ్ముకొని చమట చిమ్ముకొని
ఈ జన్మకు ఇక ఇంతే ననుకొని
కూలిడబ్బులతో కుటుంబభారం
సరిపడతూచే శ్రమైక జీవులు
గొడ్డు గోద పొలము పుట్టల
సేవకు బ్రతుకును శిథిలం చేసే
తగ్గు మొగ్గుల తరాజు బ్రతుకుల
కొనసాగించే కర్షక జీవులు

ఎన్నాళ్ళున్నా ఎన్నేళ్ళున్నా
గొర్రెతోకలే గోష్పాదాలే

కష్టం నష్టం కనివిని యెరుగక
ప్రజలను ప్రభుతను పీల్చే జలగలు
ఇంతై అంతై ఎంతెంతో యై
విరాట్ రూపులై విజృంభిస్తే
తెల్ల ఏనుగులై తిరుగుతు ఉంటే
ఎన్జీవోల శ్రమైక జీవుల
కర్షక జీవుల కడునిరు పేదల
జీవన రీతులు జీవిత గాథలు

ఎన్నాళ్ళున్నా ఏన్నేళ్ళున్నా
గొర్రెతోకలే గోష్పాదాలే

వెటర్నరీ ఆఫీసర్
కొల్లూరు
గుంటూరు జిల్లా.
522 324

# పట్టెడన్నం పెడుతున్న—వాడు

—తిరునగరి

వానికంతా శూన్యం
వాని కళ్ళల్లో దైన్యం
వాని జీవితం
సహారాలో బలహీనంగా భారంగా సాగే సార్థవాహం
వాణ్ణి గూర్చి వాస్తవంగా ఆలోచించే వాడేలేడు
వాని పేరు చెప్పుకొని పబ్బం గడుపుకునే వాళ్ళే అందరూ
వాని ముత్తాతల తరం నుంచి చూడు
అదే బ్రతుకు
గానుగెద్దులా తిరుగుతూనే ఉంటాడు
అదే పాక
శిథిలాల్లోంచి సూర్యచంద్రులు తొంగిచూస్తుంటారు
అదే గొంగడి
చిల్లుల్లోంచి శీతవాతాతపాల సంచారం
వాని మీద
కవులు కావ్యాలు వ్రాసి డబ్బు చేసుకుంటారు
వాని మీద
నిర్మాతలు తీసే చిత్రాలు బాక్సాఫీస్ హిట్టవుతాయి
వాని మీద
రాజకీయపార్టీలు మెనిఫెస్టోలు విడుదల చేసి ఎన్నికల్లో గెలుస్తాయి
వాడు
పాఠ్యపుస్తకాలలో దేశానికి వెన్నెముక
మహామహుల సందేశాలలో ఉపన్యాసాలలో
వాడు ఎనలేని త్యాగమూర్తి
ఎన్ని త్యాగాలు చేసేనేం
వాడీనాడు ఘోరంగా దోచబడుతున్నాడు

ఎన్నాళ్ళనుంచి చెమటోడి స్తేనేం
వాణ్ణి బికారిని చేస్తున్నది నిర్దాక్షిణ్య సంఘం
వాని స్వేదఫలానికి మార్కెట్‌లో రేటు పలకదు
దళారీల చేతులు మారాక దాని ధరే ఆకాశం నుంచి వెక్కిరిస్తుంది
వాడు వస్తులుండైనా కట్టాలి శిస్తు
కాలం చిన్నచూపు చూచినా, మానెడు గింజలు రాలకపోయినా
అప్పులకింద ఆస్తిపాస్తుల జప్తు
వాడందరికీ లోకువే
సంతృప్తి పరచకుంటే వెలగదు విద్యుత్తు
గౌరవించందే రావు ప్రభుత్వ రాయితీలు
ఎరువుల ధర పెరిగిందంటే
ఏమీ మాట్లాడవద్దనే డీలర్లు
ఎందుకీ సంసారం
పెళ్ళాం పిల్లలకైనా బట్టలు తే చాతకాదనే భార్య
పెళ్ళీళ్ళ కెదిగిన ఆడబిడ్డలను చూస్తే గుండెల్లో ఆరనిజ్వాల
నీరు చాలక సగం ఎండి బీటలువడ్డ పొలం
మాయదారి రోగంతో వాడి వత్తలయ్యే చేలు
ఇంట్లో అంతా అశాంతి
బయటకు వస్తే ఏది శాంతి?
వానికంతా శూన్యం
వాని కళ్ళల్లో దైన్యం
వాని జీవితం
సహారాలో బలహీనంగా భారంగా సాగే సార్ధవాహం
ఆశోకమూర్తి ఎవరు? ఎవరు?
సమాజరథ చక్రపుటి రుసుల్లోపడి నలుగుతున్న వాడు
పుట్టెడు దుఃఖందిగమ్రింగుతూ జాతికి
పట్టెడన్నం పెడుతున్నవాడు.

'కవితా సదనం,
పోచమ్మవాడ
నల్లగొండ జిల్లా.

# వేమన దృష్టిలో 'స్త్రీ'

-ఆర్. పురుషోత్తమరావు

వేమన 17వ శతాబ్దివాడు. సమకాలీన సమాజమును చిత్రిక పట్ట వలెనని కాంక్షించిన వాడు. తాను చెప్పదలచుకున్న నీతిని 'సూటి'గ 'మేటి'గ చెప్పడంలో ఆరితేరిన వాడు. ప్రజాజీవన విధానానికి ప్రతిబింబముగ తన కవితను ప్రతిధ్వనింప జేసి 'ప్రజాకవి'గ ప్రఖ్యాతి బడసిన వాడు.

వేమన మొదట సరసుడు. శృంగార రసాంబుధిలో తేలియాడిన వాడు. ఆ ఆటలతో విసిగిపోయి వివాహ వ్యవస్థపై విశ్వాసము పెంచుకుని కట్టుబాటుగ వివాహ జీవితము సాగించ వలెనని సంబర పడినవాడు. స్వజీవితమున బాధలకు లోనయి విరసుడై విరాగియై వేదాంత భక్తికి చివరకు దాసుడైన వాడు.

"యత్రనార్యస్తు పూజ్యన్తే రమన్తే తత్రదేవతాః" అన్నది ఆర్యోక్తి. స్త్రీలు పూజింప బడుచోట లక్ష్మీదేవి లాస్యం చేస్తుందని భావము. విశృంఖల జీవితముపై విసిగి వేసారిన వేమన తన దాంపత్య రాగవీణ సదా సుస్వరాలనే పలకాలనీ తన జీవన కలశం సదా సుధా ధారలతో తొణికిస లాడాలనీ- ఆనందానికి మరో పేరు తన మధుర జీవితం కావాలని భావించాడు.

సుగుణ వంతురాలు సురతియై యుండిన
బుద్ధిమంతులగుచు పుత్రులొప్ప
స్వర్గమేటి కయ్య సంసారి కింకను

-నిగృహమే స్వర్గసీమ యని-సుఖ జీవనము నందించు ఇల్లాలే ఇంటికి జ్యోతిగ భావించెను.

ఆలు పూలతెప్పయని' భవసాగరము ఆనంద సాగరమని ఊహించెను. భార్యావిరహము భరింపలేని వాడుగ ఏమంటున్నాడో చూడండి.

తుంట వింటివాని తూపుల ఘాతకు
వింటి మంటి నడుమ మిడుక దరమె
ఇంటి యాలు విడిచి ఎట్టుండ వచ్చురా?

అని వాపోవడం మనసుకు విన్పిస్తున్నది. క్రొత్తగ తన జీవితంలో అడుగు పెట్టిన ధర్మ పత్నికి కూరిమి మగడుగ

ఇంటి యాలు విడచి యిల జారకాంతల
వెంట దిరుగు వాడు వెర్రివాడు
పంట చేను విడచి పరిగె ఏరినయట్లు

అంటాడు. మన కందు బాటులో ఉన్న కథలను వాస్తవంగ మనం భావిస్తే— పూర్వాశ్రమంలో 'ఆటవెలదు' లతో ఆటలాడిన వేమన 'స్త్రీలోలుడు' 'వేశ్యాప్రియుడు' 'జారిణీ మానస చోరుడు', అందుకే కాబోలు వేమన

ఆడుదాని జూడ నర్థంబు చూడగ
బ్రహ్మకైనను పుట్టు రెమ్మ తెగులు

అని తీర్మానించా డొకచోట. అట్టిపూత మెరుంగు వంటి వలపుఃగల పడుపు వృత్తితో సహజ సుందర మగు స్నేహభావము పొడ సూపక ఆ త్రోవను మార్చుకుని కట్టుబాటు గల కల్యాణ వ్యవస్థను గారవించటం నేర్చుకున్నాడు. అందుకే ఇల్లాలు పంట చేనువంటిది అంటాడు. బహుచక్కని పోలిక. సౌభాగ్యము సంక్షేమము అందించే కల్పతరువు ఇల్లాలు. చేతి కందు

బాటులో వున్న స్వర్గసీమను వదిలి పరిగె వేరుకుని బ్రతుక వలసిన ఖర్మ మేమిటని ప్రశ్నిస్తాడు.

వేమన భార్యా విధేయత ఎడ పరాఙ్ముఖతను ప్రదర్శించాడు.

> ఆలు మగని మాట కడ్డంబు వచ్చెనా?
> ఆలు గాదు నుదుటి వ్రాలుగాని
> అట్టి యాలు విడచి నడవి నుండుట మేలు
> మాట వినని యాలు మగనికి మరణాలు

అని నిక్కర్షగ చెప్తాడు
మొక్కగా వంగనిది మానై వంగుట కష్టమని-అలాగే పెడసరపుగు ఆడు దానిని ఆదిలోనే వంచుట మేలని హెచ్చరించినాడు.

> ఆలి నొంచలేక అధమత్వమున నుండి
> వెనుక వంతుననుట వెర్రిమాట
> చెట్టు ముదరనిచ్చి చిదిమిన బోవునా

అంటాడు. గడుసైన ఆడుది మగని హింసించు విధానం గురించు చెప్తూ

> వాడకుఱికి తిట్టు వలదన్న మొరవెట్టు
> ముందు మగని తిట్టు ముసుగు బెట్టు
> గడుసురాలు మగని గంపతో నమ్మురా

అంటాడు.

ధనమూలమే జగత్సర్వమని, సంపాదించు మగవానికే ఆడది విలువ నిస్తుందని చెప్తూ

> కలిమి నాడు మగని కామించి చూచును
> లేమి చిక్కనాడు లేవకుండు
> మనిన మగనినైన మడియంగ జూచును

అని లోకరీతిని వివరిస్తాడు.

స్త్రీ స్వాతంత్ర్యము విషయమున వేమన పరాఙ్ముఖతను ప్రదర్శించినాడు ఆ పరాఙ్ముఖతను రానురాను ద్వేషముగ పరిగణించుట చింత్యము. స్వజీవితమున దాంపత్య సుఖమును నోచుకొనక పోవుటే ఇందులకు కారణమని కొందరి తలంపు

> ఔర యాడుదాని నా బ్రహ్మ సృష్టించె
> పురుషు పాలిటి పెను భూతమట్లు
> దాని వలన జిక్కకొని వాడుండునే

అంటూ

> కైక పుట్టి చెరచె గా రాము పట్టంబు
> సీత పుట్టి లంక చెరచె గాదె
> కౌరవులను చెరిచె గద ద్రౌపదియు గూడ

అని విపరీత వ్యాఖ్యానమున కొడ బడుట మనకు కనబడుతుంది.

మానవతి యైన స్త్రీ-పతియే ప్రత్యక్ష దైవముగ భావించ వలెనని వేమన భావము. ఈ భావము సంప్రదాయాను సారి. ఈ విషయంలో వాల్మీకి మాటేమిటో చూద్దాం—

'భర్తనాం పరం నార్యా భూషణం భూషణాదపి'
ఇక వేమన మాట వినండి

> పతిని దిట్టరాదు పదివేలకైనను
> పెట్టి చెప్పరాదు ప్రియముగాను
> పతిని మీఱరాదు సతి మానవతి యేని

అని తీర్మానిస్తూ

> పతిని భావమందు పరమాత్మగా నెంచు
> పడతి కవురు గతిని పరను టంగ్రడు
> పతిని దూరునట్టి పడతికి దుర్గతి

అని హెచ్చరించాడు.

పరకాంతా వ్యామోహము పనికి రాదని వేమన ఖండితముగా చెప్తూ

> తన్ను గన్న యట్టి తల్లి పంటిది సుమ్ము
> అన్య కాంత న్యాయ మరసి చూడ అంటూ

ఎట్టి స్త్రీలగనిన ఇంతింత యనరాదు
కామ వహ్ని ఒక్క గరగిన యట్లు
ఇట్టి గాఢ మోహ మెంతైన జేయురా

అని మనను హెచ్చరించడం కూడ కన్పిస్తుంది. 'పరసతి గమనంబు ప్రత్యక్ష నరకంబు' అని పదే పదే మనకు గుర్తు చేస్తాడు. ఆ మాటలే వాల్మీకి వాణిలో ఇలా ఉన్నాయి.

అతుష్టం స్వేషుధారేషు చపలం చపలేన్ద్రియమ్
నిమన్తి నికృతి ప్రజ్ఞం పరదారాం పరాభవమ్

కామ వహ్ని గల మనిషి పరదారా వ్యామోహంలో పడిపోతే అతనికి పతనమే ప్రాప్తిస్తుంది అంటాడు. అలాగని వేమన అందరి స్త్రీలను ద్వేషించలేదు. దుయ్యబట్టడానికి ప్రయత్నించ లేదు. శిరోధార్యమైన సుగుణవంతుల విషయంలో ఏమంటున్నాడో చూడండి.

గుణవతి గల గృహము గోము నందించును
చీకటింట దివ్వె చెలగినట్లు
దేబె యున్న కొంప దివ్వె మలపిన యట్లు

అంటూ వైవిధ్యాన్ని మనకు తెలియ బరుస్తాడు.

ఆడుదాని బొంకు గోడ బెట్టిన యట్లు
పురుష వరుని బొంకు పూరి తటిక
స్త్రీల నేర్పు మగని జీకాకు పఱచురా-

అంటాడు. కాబట్టే ఆడుదాని మాటలకు అర్థాలే వేరైన వేమో- ఇంతేకాదు పాపపుణ్య విషయములో ఆడువారికి గల అదృష్టముపై 'అసూయ' పడినాడు.

సతి యొనర్చు చెడుగు పతి కవశ్యము వచ్చు
పతి యొనర్చు మంచి సతికి సగము
పతి యొనర్చు చెడుగు సతికేల రాదురా?

అని వాపోతాడు.

పరమ సాధ్వులకు ప్రణతు లర్పించడం కూడ మనకు వేమనలో కన్పిస్తుంది.

ఆలు మగలు అంతః కలహాలు లేక అనవసరపు రగడలకు పోక అన్యోన్యముగ తమ దాంపత్య జీవితమును తీర్చి దిద్దుకొన గలిగితే వారి గృహము ఆనంద నిలయమై భాసించునని విపరిస్తాడు. అలా కాక ఇంటిలో మనస్పర్థలు కలిగిన మనుషు లున్నప్పుడు ఆ ఇల్లు ఇలా ఉంటుందట

చెప్పులోని రాయి - చెవిలోని జోరీగ
కంటిలోని పోరు ఇంతింత కాదయా-

అంటాడు.

స్త్రీలు గల్గుచోట జెల్లాటములు గల్గు
స్త్రీలు లోని చోట చిన్నబోవు
స్త్రీల చేత నరులు చిక్కల బడుదురు

అని స్త్రీలు ఉండాలా? అక్కర్లేదా? అన్న విషయంలో విచికిత్సకు లోనవడం మనకు కన్పిస్తుంది.

వేమన సమకాలీన జీవితముపై ప్రత్యక్ష వ్యాఖ్యానము సల్పిన ప్రతిభాశాలి. శీలవతి సుగుణవతి యైన స్త్రీని వేమన శిరోధార్యముగ భావించి-దుశ్శీల వతులను పెంకెలను, గయ్యాళులను దుయ్యబట్టుటలో వెనుకంజ వేయలేదు. స్వాతంత్ర్యము విషయమున వేమన వెలువరించిన అభిప్రాయము ఆనాటి సహజ జీవిత సంబంధి కాబోలు. కానీ కవి క్రాంతదర్శి త్రికాలవేది. అట్టి వేమన దృష్టిలో 'స్త్రీ' పలుచగా కన్పించుటకు కారణ మూహింప దగినది. విశృంఖల విహారము స్త్రీ పురుషుల యెడ ఎవరిపట్ల ఉన్నను అది దాంపత్య జీవిత సుఖ గమనమునకు తోడ్పడదు. హద్దులో జీవితమును ముద్దుల మూటగ మార్చుకొనిన వారినెవరు ప్రశంసింపరు.

శుభం భూయాత్ !

ఆఫీసర్
స్టేట్ బ్యాంకు ఆఫ్ ఇండియా
గుంటూర్ బజార్
గుంటూరు - 3
522003

# ప్రకాశం జిల్లాలోని కొన్ని మాండలికములు

— విద్వాన్ దేవులపల్లి విశ్వనాథం

ఆయా మండలములందు ప్రత్యేకముగ ప్రయోగింపఁబడు పదములను మాండలికము లందురు. మాండలికము లనేక రకములు. వీటిలో భౌగోళిక మాండలికములు ముఖ్యమైనవి. ఆయా ప్రాంతములందలి ప్రత్యేకతనీ మాండలికములు చాటి చెప్పును. అన్య భాషాప్రభావము వలన కూడ మాండలికము లుద్భవించును మాండలికముల వలన భాషా ప్రాచీనతను గుర్తింప వచ్చును.

ప్రకాశం జిల్లా మూడు జిల్లాలలోని మారుమూల తాలూకాల కలయిక వలన నేర్పడినది. కర్నూలు జిల్లా నుండి గిద్దలూరు, మార్కాపురం తాలూకాలను, నెల్లూరు జిల్లానుండి కనిగిరి, దరిశి, పొదిలి, కందుకూరు తాలూకాలను, గుంటూరు జిల్లానుండి ఒంగోలు, అద్దంకి తాలూకాలను కలిపి ప్రకాశం జిల్లా గయేర్పాటు చేసిరి. ఆ తరువాత కొన్ని సబ్ తాలూకాలనుతాలూకా స్థాయికి పెంచిరి. మరికొన్ని క్రొత్త తాలూకాలను నెలకొల్పిరి. ఈ మూడుజిల్లాల మాండలికాలు కలిసి ప్రకాశంజిల్లా మాండలికములు నేర్పడినవి ప్రస్తుతము ప్రకాశంజిల్లా మాండలికములలో కొన్నిటిని పరిశీలించెదము.

1. మబ్బుల్లో = చీకటిలో.

మబ్బు అను పదము మేఘము అను అర్థంలో ఎక్కువగ వాడుకలో గలదు. కాని ప్రకాశం జిల్లాలోని గిద్దలూరు ప్రాంతంలో 'మబ్బులో' అను పదమును చీకటిలో అను అర్థమున ప్రయోగించు చున్నారు ఇది కర్నూలు జిల్లానుండి వచ్చినది. వాడు మబ్బులో పోతున్నాడు.

2. అమ్మి = అమ్మాయి.

ఓ అమ్మి ! ఇటురా.

3 అబ్బి = అబ్బాయి.

ఆరే అబ్బి ! చదువుకో

4. వోగు = వాగు.

వోగు బోవచ్చింది.

5. పోంగొట్టు కొనుట = పోగొట్టు కొనుట.

ఇది నెల్లూరు జిల్లానుండి వచ్చిన పదము. తమిళ భాషా ప్రభావము వలన ఏర్పడెను.

6. సమంగ = బాగుగ;

సక్రమంగ ఇది ఒంగోలు ప్రాంతంలో ఎక్కువగ వాడుకలో గలదు.

7. వైనంగ = వివరంగ

ఇది కూడ ఒంగోలు ప్రాంతంలో వాడుకలో గలదు. దాన్ని వైనంగ చెప్పరా.

8. బేగ = వేగముగ.

ఇది కర్నూలు జిల్లానుండి వచ్చిన పదము. ప్రస్తుతము గిద్దలూరు ప్రాంతమున వాడబడు చున్నది.

బేగ చదువు

9. పంపు = మాగాణి.

ఇది ఎఱ్ఱగొండ పాలెం తాలూకా ప్రాంతంలో వాడబడుచున్నది. పంపు అనగా నీళ్ళ పంపు లేక పంపుట అను అర్థములు ప్రచారములో గలవు

నేను పంపుదాకా పోయి వస్తాను.

10. బువ్వలాల = అన్నం తినే సమయం

బువ్వ లాలయింది.

11. కూరాకు = కూర.

ఇయ్యాల మీ యింట్లో ఏం కూరాకు ?

12. కూడు = అన్నము.

13. పైటాల = మధ్యాహ్నము

పైటాలయింది. వాడింకా రాలేదు.

14. మేర = పనివాండ్లకు సంవత్సరాని కిచ్చే గింజలు

ఈ సంవత్సరం మేరగింజ లింకా ఇవ్వలా.

15 అంగి = చొక్కా.

ఈ అంగి పోట్టిదైంది.

16. నిక్కరు = లాగు.

ఈ నిక్కరు చినిగింది.

17. తుండు = టవలు.

తుండు పంచ కట్టుకొని స్నానం చెయ్యి.

18. అయ్యవారు = ఉపాధ్యాయుడు.

బ్రాహ్మనుడు ఉపాధ్యాయుడు అనే అర్థంలో దరిశి, పొదిలి, కనిగిరి, తాలూకాలలో ప్రయోగింపబడు చున్నది. ఇది నెల్లూరు జిల్లా నుండి వచ్చినది. మార్కాపురం తాలూకాలో బ్రాహ్మణుడు అనే అర్థంలో వాడుకలో గలదు.

19. పంతులు = ఉపాధ్యాయుడు, బ్రాహ్మనుడు.

పంతులుగారు చదువు బాగా చెపుతున్నాడు.

పూజ చేయించటానికి పంతులు గారింకా రాలేదు.

బ్రాహ్మణుడు అనే అర్థంలో గుంటూరు జిల్లా ప్రభావము వలన వాడబడు చున్నది.

20. గబ్బు చమురు = కిరసనాయిలు

బుడ్డిలో గబ్బుచము రయిపోయింది.

21. రామ్ములక్కాయలు = టమోటాలు.

ఎఱ్ఱగొండ పాలెం ప్రాంతంలో వాడబడుచున్నది.

రాములక్కాయల చారు బాగున్నది.

22. కోడి బుడమకాయలు = టమోటాలు.

ఇదికూడ ఎఱ్ఱగొండ పాలెం ప్రాంతంలో వాడుకలో గలదు.

కోడి బుడమకాయలు పప్పులో వెయ్యి

23. బుడమకాయలు = దోసకాయలలో మరీ చిన్నవి.

బుడమకాయల పచ్చడి నూరు.

24. కూటాళ = అన్నము తినే సమయము

కూటాళయింది. కూడు తినరా.

25. అంబలి ప్రొద్దు = అన్నము తినే సమయం.

అంబలి ప్రొద్దయినా ఆరక యిడవలేదు.

26 చల్ల = మజ్జిగ

ఇంకా నేను చల్లబిలక లేదు.

27. లగెత్తు = పరుగెత్తు.

తొందరగ లగెత్తు.

28. సుస్తీ చేసింది = జబ్బు చేసింది.

నాకు సుస్తీ చేసింది.

29. మట్కాయలు = గోరు చిక్కుడు కాయలు.

మట్కాయలు మార్కెట్‌లో లేవు.

30. చీనీకాయలు = బత్తాకాయలు

నేనీయేడు చీనీ తోటేశా.

31. మాసి = మనిషి.

ఎవరా మాసి ?

32. రెడ్డి = మునసబు.

ఈ గ్రామ రెడ్డి యెవరు ?

33. మచ్చు = అటక.

ఈ కట్టెమచ్చు మీద వెయ్యి.

34. తవ్వ = శేరు.

తవ్వనిండా గింజలు తీసుకురా.

35. పడి = శేరు.

కూలోడికి రెండు పళ్ళగింజ లిచ్చిరా.

36. బుక్కు = పుస్తకము.

బుక్కు పట్టుకొని చదువు.

ఇది ఇంగ్లీషు ప్రభావము వలన వచ్చినది.

37. దండిగ = ఎక్కువగ.

వాడికి దండిగ అన్నము పెట్టు.

38. కట్ట = బస్తా.

నేను రెండు కట్టల బియ్యం అంగడి నుండి తెచ్చాను.

ఇది నెల్లూరు జిల్లా నుండి వచ్చినది

పైవిధముగ ప్రకాశం జిల్లాలోని మాండలికములలో కొన్నిటిని ప్రస్తావించితిని. ఇంకను మాండలికములపై పరిశోధన నెక్కువ గావించుట యవసరము.

తెలుగు పండిట్,
ప్రభుత్వ జూనియర్ కళాశాల
టంగుటూరు,
ఒంగోలు (తాలూకా
ప్రకాశం (జిల్లా)

చిన్నకథః

# వరహాభిక్ష

—పైడిపాటి సుబ్బరామశాస్త్రి

స్వాములవారు వచ్చారు. సుబ్బయ్య యింటికి.

సుబ్బయ్య పెద్దగా ఉన్నవాడు కాకపోయినా, కలిగినంతలో ఇతరులకు పెట్టే స్వభావం కలవాడు, సుబ్బదాసుగారి శిష్యుడూ, పరమ భక్తుడూ, ఆయన భార్య సీతారామమ్మ కూడా దొడ్డయిల్లాలు, నాస్తికబ్ధం లేదు.

"వండ నలయదు వేవురు వచ్చిరేని, అన్నపూర్ణకు నుద్దియే యతని యాలు" అని పెద్దనగారు చెప్పిన స్త్రీ కోవలోనిది. ఆమె ఒకసారి ఒక బ్రాహ్మణుడు, ఇంట్లోకి వచ్చి "ఆకలి మండి పోతోంది, అన్నం పెట్టమ్మా! అన్నాడు ఆమెతో. "వండి పెట్టాలి నాయనా! ఒక గడియ కూర్చో" అంది. "అందుకా నా ప్రాణం నిలువదు, చద్ది అన్నం ఉన్నాసరే-పెట్టు!" అన్నాడు "నీవు శ్రోత్రియుడవు కదా! పర్యుషితాన్నం పనికి వస్తుందా?" అన్నది. "ఆ కొన్నవాడికి ఏదయినా పనికి వస్తుంది. ముందు ప్రాణం నిలవాలి?" అన్నాడు. ఆమె మడి కట్టుకు వడ్డించింది. అత డారగించి వెంటనే వెళ్ళిపోయాడు- ఆమె తాంబూలం దక్షిణా తెచ్చే లోగానే!

ఆమె వాకిట్లోకి వచ్చి "ఆ బ్రాహ్మణు డేడీ?" అని అడిగింది భర్తను. భర్తతోపాటు అక్కడ ఇతరులూ ఉన్నారు. "బ్రాహ్మణు డేమిటి? ఇక్కడి కెవ్వరూ రాలేదే! మతి ఏమన్నా పోయిందా?" అన్నాడు,భర్త. 'బ్రాహ్మణుడు లోపలికి వచ్చి భోజనం చేశాడు కదా! అంది. "మేము ఇక్కడే ఉన్నాం. నర మానవుడే వ్వడూ లోపలకు పోలేదు- బయటకు రాలేదు" అన్నారు, అక్కడి వారందఱూ అయితే, వచ్చిన వాడు, భగవంతుడే, పరీక్ష కోసం వచ్చాడు!" అని వారిని లోపలకు తీసుకు వెళ్ళి భోజనం చేసిన విస్తరిని చూపించింది. వారు ఆశ్చర్యపడ్డారు.

సుబ్బయ్య చెల్లెలు జ్ఞానమ్మ కూడా ధార్మికబుద్ధి కలదే. ఆమె వితంతువు అయిన కారణం చేత అన్నగారి దగ్గఱే ఉండిపోయింది. సంతానం లేనిది. యతీశ్వరుల యందు గాఢభక్తి కలది. ఒకనాడు ఒక యతి వారి యింటికి వచ్చాడు. ఇంటిల్లిపాదీ వారికి వందనం చేశారు. సుబ్బయ్య వారిని భిక్ష స్వీకరించి అనుగ్రహించమని అభ్యర్థించాడు. స్వాముల వారు అంగీకరించారు.

భిక్ష స్వీకరించిన తర్వాత, జ్ఞానమ్మ తనకు వేదాంత విషయంలో సందేహాలున్నవనీ, రోజూ ఇక్కడే భిక్ష స్వీకరించమనీ కోరింది. ఆ నాటికి ఆమె సందేహాలు కొన్ని నివర్తింపచేసి సాయంతం వారు ఎక్కడికో వెళ్ళారు- తిరిగి ప్రొద్దున్నేవచ్చారు.

ప్రతిరోజూ ఈ విధంగానే స్వాములవారు వెళ్ళి వచ్చేవారు. రెండవపూట ఆహారం స్వీకరింపనని చెప్పివేశారు.

పదిహేను రోజులు గడిచిపోయినై. భిక్షానంతరం తనకు కలిగే సందేహాలు నివర్తింపబడుతూ ఉన్నా, స్వామివారు రాత్రిళ్ళు ఎక్కడికి వెడుతున్నారో తెలుసుకోవాలనే కుతూహలం కలిగింది జ్ఞానమ్మకు.

క్రమక్రమంగా స్వామియందామెకు చనువు ఏర్పడింది.

"స్వామీ! తాము ప్రొద్దున్నే స్నానం చేసి వస్తారు. సాయంత్రం ఉండరు దేవాలయంలో తప్ప, కొందఱు సన్న్యాసులు గృహస్థుల ఇండ్లలో ఉండరు. తమరు కూడా అంతేనా? లేక ఇంకా ఎవరి యింట్లో నయినా ఉంటున్నారా? అల్లా ఉంటే, నాకు వేదాంత శ్రవణం, విచారణ చేయడానికి ఎక్కువ అవకాశం కలుగుతుంది కదా!" అన్నది. స్వామివారు నవ్వారు.

"ఇన్నాళ్ళనుండే ఈ ప్రశ్న ఎందు కడగలేదు?" అన్నారు.

"తమరు పెద్దలు. వేదాంత విషయంలో తప్ప, ఇతరములైన ప్రశ్న లడిగితే ఏమి అపరాధమో అని భయపడ్డాను."

"సరే! మేము గ్రామైక రాత్రం- దినమైక భుక్తంగా, కాలం గడిపేవాళ్ళం. ఇప్పుడే విజయవాడలో ఇన్నాళ్ళు ఉండవలసి వచ్చింది" జ్ఞానమ్మ మాట్లాడలేదు.

"నేను రాత్రిపూట వేరే కార్యక్రమం మీద వచ్చి ఉండడం చేత, మీ యింట్లో రెండవపూట ఉండడం లేదు."

"ఆ కార్యక్రమాన్ని ఈ శిష్యురాలు తెలుసుకో వచ్చునా?"

"ఇప్పుడు తెలపవచ్చు. నేనూ మఱి కొంతమంది బ్రహ్మ విచారణ చేస్తున్నాం. అది యీ రోజుతో పూర్తి అవుతుంది."

"ఇది చివరిరోజు అని తమరే సెలవిస్తున్నారు కదా అది ఎక్కడో సెలవిస్తారా?

"కనకదుర్గ సాన్నిధ్యంలో!"

"రాత్రి అంతా గుడి తలుపులు తెఱచిఉంటయ్యా?

"మీకు కన్పించే గుడి వేరు. మా ఆలయం వేరు. అది అంతా స్వర్ణమయం! ఇంద్ర కీలాద్రి లోపల ఉన్నది. గుడి కెదురుగా తామర కొలను ఉంది. అమ్మగారి విగ్రహం సాక్షాత్తు స్వర్ణమయమే. అక్కడ దేవికి అర్చనలు జఱుగుతూ ఉంటవి."

జ్ఞానమ్మకు ఆసక్తి పెరిగింది.

"నన్ను కూడా తీసుకువెళ్ళరా, స్వామీ! ఈ దీను రాలి యందు దయలేదా?" అని కన్నీళ్ళతో అడిగింది.

"తీసుకువెళ్ళడానికి అభ్యంతరం లేదు కాని, నీవు మాత్రం రాలేవు!

"నేను రాగలను స్వామీ!"

'అయితే సరే!'

'నాతోపాటు ఇంకాబ్రహ్మవిచారణకు వచ్చినవాళ్లంతా ఉంటారు. వారిలో యతీశ్వరు లున్నారు. సిద్ధులున్నారు. చూడడానికి వారువీధుల్లో తిరిగే మామూలుమనుష్యులల్లే కన్పిస్తారు. మన భాషరాని వాళ్ళున్నారు. వారంతా సంస్కృతంలో ప్రసంగిస్తారు."

"అంతమంది మహనీయులున్న చోటికి మీరు వెడుతున్నారు కదా! కూడా నేను రావడానికి మీ కభ్యంతరం ఏమిటి?"

"అభ్యంతరం లేదు. నువ్వు రాలే వన్నాను. రాగల నన్నావు. సరే నన్నాను"

జ్ఞానమ్మ ఊరుకుంది. మహనీయులతో ప్రసంగం పెంచడం ఇష్టం లేక- పైగా వారు ఆమోదించిన తర్వాత తాను మాట్లాడవలసిన దేముంటుంది కనుక!

సాయంత్రం స్వామివారు బయలుదేఱారు.

జ్ఞానమ్మ అనుసరించింది.

దారిలో ఒకరితో ఒకరు మాట్లాడలేదు.

కనకదుర్గ ఉన్న కొండ వెనుక ప్రాంతానికిస్వామి వారు వెళ్ళారు. ఆ కొండ మొదలుకు జ్ఞానమ్మ కూడా వెళ్ళింది. వారి వెనుకనే నిలబడింది.

స్వాములవారి శరీరం క్రమక్రమంగా కుంచించుకు పోతోంది.

చివఱకు చీమంత అయింది.

ఒక రంధ్రంలో దూరిపోయింది.

జ్ఞానమ్మ తెల్లముఖం వేసుకొని నిలబడిపోయింది.

చుట్టు ప్రక్కల అప్పుడక్కడ ఎవ్వరూ లేరు. తర్వాత ఎవరో వచ్చారు. 'ఇక్కడ నిలబడ్డావేమమ్మా?' అన్నారు.

'ఏదో నిలబడ్డాను లే!" అని, యింటికి వచ్చి వేసింది.

జఱిగిన దంతా అన్నకు చెప్పింది. ఆయన ఆశ్చర్యపోయాడు.

'మన యింటికి వచ్చింది సిద్ధుడన్న మాట! పరమేశ్వరుడు అణువు కంటె సూక్ష్మమైనవాడు, పెద్ద వస్తువు కంటె పెద్దవాడు- అని చెబుతారు. ఇట్టి సిద్ధి పరమేశ్వర లక్షణంలో ఒక భాగం- అష్ట సిద్ధులలో ఒకటి ఇల్లాంటి మహానీయులతో, మనం జాగ్రత్తగా ఉండాలి. వారికి కోపం వస్తే ఏమయినా చేయగలరు. అన్నాడు సుబ్బయ్య.

'అనుగ్రహం వచ్చినా అంతేకదా!'

'అంతే'

యధా ప్రకారంగా మరుసటి దినం ప్రొద్దున స్వాములవారు వచ్చారు. జ్ఞానమ్మ క్రిందటిరోజున జఱిగిన దానిని గూర్చి ఏ ప్రసంగం చేయలేదు 'నీవు రాలేవని' ముందే వారు చెప్పారు కదా? భిక్ష సమయం వచ్చింది.

'ఇవాళ వరహా దక్షిణ ఇస్తేనే భిక్ష!' అన్నారు స్వామి.

సుబ్బయ్య చెల్లెలివంక చూశాడు.

జ్ఞానమ్మ నాలుగు రూపాయలు అక్కడ పెట్టింది.

స్వామివారు భిక్ష చేశారు.

విశ్రాంతి తీసుకోకుండా వెంటనే లేచారు

జ్ఞానమ్మను పిలిచారు.

ఆమె వచ్చింది.

ఆ వరహా ఆమె చేతిలో ఉంచారు.

'నీ భక్తిశ్రద్ధలకు చాలా సంతోషించాను. నీసందేహాలన్నీ ఇంచుమించుగా నివృత్తి అయినట్లే ఇంకా ఏమయినా ఉంటే, నన్ను తలచుకుంటే నివృత్తి అయిపోతాయి. నీవు ఉత్తమజీవివి. ఈ వరహా నీ దగ్గఱ ఉంచుకో. నీకు అన్నోదకాలకు లోపం ఉండదు. అసలు ఈ గృహం లోనే ఆ లోపం ఎప్పుడూ రాదు. అన్నారు స్వామివారు.

క్రిందటిరోజు జఱిగిన దానిని గుఱించి కాని, ఇంకా ఏమయినా అడగాలని కాని ఇంట్లో ఎవ్వరికీ స్ఫురించలేదు.

అందఱూ వందనం చేశారు.

స్వామివారు నారాయణ స్మరణ చేస్తూ బయటకు నడిచారు.

'రేపు భిక్షకు వస్తారా?' అని అడగాలని అనిపించింది జ్ఞానమ్మకు.

పఱుగున గుమ్మం దగ్గఱకు వెళ్ళింది.

స్వామివారు ఎక్కడా కన్పించలేదు.

'నేను వెంటనే ఉరుకులతో పరుగులతో వెళ్ళాను కదా? వారు కన్పించ లేదేమిటి?' అన్నది, లోపలకు వచ్చి సుబ్బయ్యతో.

'వారికి తిరస్కరిణీ విద్య ఉన్నదేమో? లేకపోతే వెంటనే ఇతరులకు కనబడకుండా ఎల్లా మాయమవుతారు? నీకు ఆ ప్రశ్న అడగాలనే సంకల్పం కలుగుతుందని. వారు ముందే ఊహించి, అప్రియం చెప్పడం ఇష్టం లేక వెళ్ళిపోయి ఉంటారు' అన్నాడు సుబ్బయ్య.

మఱునాడు స్వామివారు వస్తారేమోనని ఎదురు చూసింది జ్ఞానమ్మ.

వారు రానే లేదు.

మారుతీనగర్
విజయవాడ-520004

# పౌరాణిక ఇతివృత్తాలలోని అర్థగాంభీర్యం

— జి. ఉషా లావణ్య

నేటి సామాజిక, ఆర్థిక, ధార్మిక, రాజనైతిక పరిస్థితులలో అనేక కారణాల వల్ల ఎన్నో మార్పులు వచ్చాయి. తత్పరిణామంగా వ్యక్తి జీవిత సరళి ఆలోచనా విధానం కూడా మారిపోయింది. ఒక నిర్దుష్టమైన ఉద్దేశ్యమంటూ లేక పోవడం వలన-ఆత్మ విశ్వాసం లోపించడం వలన మానవుడు కేవలం తన జీవితాన్నే కాక సంఘ జీవితాన్ని కూడా సమస్యల మయం చేస్తున్నాడు. ఈ రకంగా వ్యక్తి ఎదుర్కొంటున్న విషమ పరిస్థితులను, అతడి ప్రతి క్రియలను కవితలు కథానికల ద్వారా అభివ్యక్తం చేయడం నేటి రచయితకి ఒక సమస్య అయింది. నేటి పరిస్థితులకు వ్యక్తుల మనో వృత్తులకు అనుగుణంగా కవితను మలచేందుకు భాష చాలడం లేదనే చెప్పాలి. అటువంటి సందర్భంలో పౌరాణిక ఇతివృత్తాలలో ఇమిడి వున్న అర్థగాంభీర్యం నేటి కవి ఆశయ సిద్ధికి ఎంతగానో ఉపకరిస్తున్నదన్న విషయం 1981-82 మధ్య ప్రచురింప బడిన కవితలను చదివితే తెలుస్తుంది.

సాధారణంగా కవి వ్యక్తి దైనందిక జీవితంలోని అనుభవాలను, అనుభూతులను, అతడి నమ్మకాలు-నైతిక విలువలను, అతడి సమస్యలను పాఠకుల ముందుంచి వాటి వెనుక గల కారణాలను అన్వేషించేందుకు ఆ సమస్యలకు తగ్గ పరిష్కారం ఆలోచించేందుకు ప్రేరేపిస్తాడు. మొదట వైదిక యుగంలో పురాణాలకు ప్రాముఖ్యత యివ్వబడింది. కాలాంతరంలో మిల్లు యజమానులు - భూస్వాములు కథా నాయకులు అయారు. ఆధునిక యుగంలో ఆ స్థానం సాధారణ మానవునికి - అతడి జీవిత సమస్యలకి యివ్వబడింది. స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత తిరిగి పౌరాణిక యితి వృత్తాన్ని ఆధారంగా చేసుకుంటూ సామాన్య మానవుని మనో నైజాన్ని స్పష్టం చేసే ప్రయత్నాలు జరిగాయి, ఇందులో మానవతా దృక్పథం ప్రధానంగా అగుపిస్తుంది. అంటే, నేటి వ్యక్తి జీవితాను భావాలను అనుభూతులను సమస్యలను విశ్లేషిస్తూ, అతడిపట్ల సానుభూతి వ్యక్తం చేసేందుకు - పరిస్థితులను చక్కదిద్దేందుకు అతి ప్రాచీనమైన - చిరపరిచితమైన పౌరాణిక యితి వృత్తాన్ని ఆధారంగా చేసుకుంటున్నాడు.

ఆధునిక సమాజంలో సామాన్యుల మనుగడ దుర్భరంగా తయారయింది వర్గభేదాల, జాతి మత భేదాల, రాజకీయ పక్షాల వత్తిడుల మూలంగా మనిషి నలిగి పోతున్నాడు. అన్యాయాలకు, అక్రమాలకు బలి చేయబడుతున్నాడు - అవమానాల పాలు చేయబడుతున్నాడు. అటువంటి పరిస్థితులో వ్యక్తికి, తన బ్రతుకు ఎంతో బరువుగా అనిపిస్తుంది. ఆదో సాగర మథనం - తృప్తినీ సౌఖ్యాన్ని వెదుక్కునే అతడి నిరంతర ప్రయత్నం సాగుతూనే వుంటుంది—

బుట్ట అల్లుకున్నా, బట్ట అల్లుకున్నా
ఆదే వారి జీవిత సర్వస్వం.

ఆ కుక్కి మంచం, ఆ కోడి పెట్ట - తిట్టినా కొట్టినా పడి వుండే తన సంసారం

వయసు మళ్ళి బ్రతుకు పుస్తకంలో
ఆఖరి అధ్యాయం ప్రారంభం అయినా

తమ వృత్తిలోనే సౌఖ్యాన్ని, సంతృప్తిని వెతుక్కుంటూ, జానెడు పొట్టకోసం ఏ బుట్టలో, ఏ నులక

మంచాలో అల్లుకొంటూ - చీకటి గుయ్యారాల్లో

వో కాస్తంత ఆశల వెలుగుని చూసుకుంటూ - మినుకు మనే జీవితాల భౌతిక చక్రభ్రమణంలో

వో బరువు బ్రతుకు సంసార సాగర మథనం
ఇది !
'గుండె గొంతుకలో ఆనంద రసహేల, ఎల్లోరా
(ఆంధ్రప్రభ 27-10-82)

ఈ 'సాగర మథనాన్నే' ఆధారంగా చేసుకుని దాని ద్వారా క్రాంతికి, శాంతికి ఆహ్వానం పలుకుతాడు మరో కవి—

క్షీర సాగర మథనంలో
ప్రభవించాయి
హాలా హలం అమృతం !
మనస్సాగర మథనంలో
ఉద్భవిస్తాయి
క్షమ – ప్రేమ !
జన సాగర మథనంలో
ఉదయిస్తాయి.
క్రాంతి – శాంతి.

'మథనమ్', చలమ్,
(ఆంధ్రజ్యోతి 20-8-82)

వికటించిన పరిస్థితులలో, యిమడలేక, నిరంతరం సంఘర్షణలో నలిగిపోయే వ్యక్తి, మూర్ఛకోసం అలమటించే వ్యక్తి ఏదో ఒక నాటికి ఎదురు తిరగడం తథ్యం ! ఈ సత్యాన్ని కేవలం ఒక పౌరాణిక పాత్ర పేరును మాత్రమే ఉచ్చరిస్తూ - పీడిత మానవత పట్ల సహానుభూతిని చూపిస్తూ అనేక కవితలు రచింపబడినాయి. ఉదాహరణకు సూర్యుణ్ణి ఆధారంగా తీసుకుని శ్రీ పి. మోహన్రాం ప్రసాద్ 'పదునెక్కిన ఉదయం లోంచి' అన్న కవితలో నేటి సమాజంలో అలుముకొంటున్న అన్యాయాలను, అక్రమాలను అడ్డుకొంటున్న 'గద్దర్' పై తన శ్రద్ధా భావాన్ని వ్యక్తం చేశారు. (20-8-82 ఆంధ్రజ్యోతిలో ప్రచురింపబడింది.) ఈ రకంగానే కాకుండా నేటి యువత ఎదుర్కొంటున్న నిరుద్యోగ సమస్యలను పాఠకుల ముందుంచే ప్రయత్నం కూడా జరిగింది. కాలేజీ చదువుల వల్ల - సంపాదించిన డిగ్రీల వల్ల వుద్యోగం రాని యువకుడికి తన భవిష్యత్తు గ్రహణం పట్టిన సూర్యుడిలా అంధకార బంధురంగా అనిపించడం సహజం-

నా కంట గట్టిన పట్టా
దాహం తీర్చుకొమ్మని యిచ్చిన సముద్రం నీళ్లు:
విశ్వ విద్యాలయపు మసి బూసిన
అక్షరాలలో నలుపు పులమబడిన గాజు పలక:
ఎదురుగా గ్రహణ సూర్యుడు తప్ప
వేరే వెలుగు కనిపించడం లేదు.

'నిరుద్యోగి పట్టా', ఈశ్వర ప్రసాద్
(ఆంధ్రజ్యోతి 2-7-82)

ఒకవైపు నిరుద్యోగ సమస్య వ్యక్తిని కృంగదీస్తుంటే, మరో వైపు వెర్రితలలు వేస్తున్న అధికార దాహం - అవినీతి సామాన్యుని జీవితాన్ని యింకా దిగజార్చుతుంది—

గేనెడు పోసినా అమృతంగా తాగేసి అవినీతి-
రావణాసురుని తలల్లా మొచ్చుకొచ్చే పదవీ
దాహం
తెలివిని తాకట్టు పెట్టి పొట్టపోసుకునే బీభత్సకం
నడి బజార్లో నగ్నంగా పరుగులెత్తే కామం
దేశమంతా కలిసి లాగినా దిగరాని ధరలు—
రేపటి సూర్యున్ని పురిట్లోనే చంపేసే అంతు
లేని చీకటి
జిడ్డోడే గిన్నె అంచు ఎక్కలేక అవస్తపడే
చీమల్లా ప్రజలు.
ఛ! వీళ్ళేం చూడగల్రు నా దేశంలో
'తుపాకీ అంచున సూర్యోదయాన్ని'

పిళ్ళంతా ఊబిలో దున్నలు.
'ఊబిలో దున్నలు', గంధం నాగసుబ్రహ్మణ్యం
(ఆంధ్రజ్యోతి - 3-9-82)

ఇటువంటి పరిస్థితులలో - శ్రమకు తగిన ఫలితం దొరకని తరుణంలో, మనిషి సోమరిగా నిష్క్రియుడిగా మారి-చివరకి భాగ్యవాదిగా స్థిరపడి పోతున్నాడు. కర్మ పథం నుంచి తొలగి గుఱ్ఱపందాలు, లాటరీలు-పీటివైపు ఆకర్షితుడై పోవడం జరుగుతోంది. అందులోని ఆశ-నిరాశలతో ఓలలాడటమే అతడి పాలిట 'అశ్వమేధ యాగం' !

జాకీలు తరుము కెళ్ళడం
గుర్రాలు పరుగు లెత్తడం
జనం పందాలు ఒడ్డడం
జాక్ పోటీల కలలు గనడం
గెలిచారా రాజయోగం
ఓడితే మరి తిరుక్షవరం
అదృష్ట దురదృష్ట ప్రయోగం
అదే - అశ్వమేధ యాగం.

'అశ్వమేధ యాగం'—బొంబాయి సుబ్బరామరావు
(ఆంధ్రజ్యోతి 25-6-82)

నేటి సమాజంలో, కుల మతాలకు యింకా ప్రాధాన్యత నిస్తూ, ధర్మం పేరిట సాగించే అవినీతికి అక్రమాలకూ అంతులేకుండా పోతోంది. అంటరాని తనం విజృంభిస్తోంది. అడ్డుకున్న వారూ, ఎదురు తిరిగిన వారూ బలికావడం జరుగుతోంది. తమిళనాడులో ఈ మధ్యకాలంలో జ్ఞానరథం గురించి వచ్చిన వార్తలు యిందుకు తార్కారణం 12-18 డిసెంబరు నాటి 'Sunday' లో కూడా ఈ విషయం గురించి ప్రస్తావించడం జరిగింది. Gnana ratham freads communal tensions' అన్న శీర్షికలో" (The viswa hindu parishad (VHP) appears to be spreading communal lensions in tamilnadu. Designed for the propafation of hinduism as well encourafe muslim convents to the hindu fold, the VHP'S Gnana ratham (chariot) has been steading making inwads in to the rural hinter - lands of the state. For example, the VHP'S influence was seen in the putiawgudi riots in june this year, which exlated into major conflagvation in which several people died, the VHP'S activities have led to communal violence in several villages dotting the Madura - Tiruchi high way where the ratham has been making its forays.)

జ్ఞానరథం పంపవద్దు అన్నందుకు పదుగురు దళితులను కాల్చిచంపారన్న వార్తని ఆధారంగా తీసుకుని శ్రీ బొజ్జా తారకం వ్రాసిన కవిత ఆంధ్ర జ్యోతిలో ప్రచురింపబడింది—

తప్పుకోండి తప్పుకోండి
జ్ఞానరథం వస్తున్నది.
ఒప్పుకోండి ఒప్పుకోండి
బ్రహ్మ ఒకడె జ్ఞానమని
అదిశేషు డొక్కడె, ఈ
భూమిని మోస్తున్నాడని
సకల చరాచర జగత్తు
విష్ణులీల హేలలని
చెప్తున్నది చెప్తున్నది
జ్ఞానరథం చెప్తున్నది
తప్పుకోండి తప్పుకోండి.

* * * *

మంటలలో మనుషులను
పెలాల్లా వేయించినా
శివుని ఆజ్ఞలేనిదే
చీమకూడ చావదని
చెప్తున్నది చెప్తున్నది.
రుద్రరథం చెబుతున్నది.

*　*　*　*

ఆర్థిక పరిస్థితులు అనుకూలంగా వుండకపోవడం వలన- మరికొన్ని యితర కారణాల వల్ల నేటి శిక్షిత యువతులు కూడా అవివాహితలుగా మిగిలిపోయి-చివరకు జీవితంఅంతం చేసుకోవడం జరుగులోంది. మరో రకంగా తగినంత కట్నం తేలేదన్న కారణంగా ప్రాణాలను కోల్పోతున్నారు. 'ఈ సమస్యను రూపుమాపడం ఎలా?' అన్నది ప్రశ్న- ఎవరైనా దీనిని కాలదన్నేవాడు రాకపోతాడా అన్న ఆశ-

త్రేతాయుగంలో
మానవుడు
శివ ధనస్సు విరిచాడు.
ద్వాపర యుగంలో
నరుడు
మత్స్యయంత్రాన్ని పడగొట్టాడు.
కలియుగంలో
మనిషి
కనీసం కట్నాలనైనా
కాలదన్నడేం ?

'పెళ్ళికోసం'—ఎమ్వీ రమేష్
(ఆంధ్రజ్యోతి 30 1. 82)

వాస్తవ పరిస్థితులకు అనుగుణంగా ప్రేమలోని స్వచ్ఛమైన అనుభూతిని వ్యక్తంచేసే కవితలూ వచ్చాయి. ('లయం'—వాణీ రంగారావ్, ఆంధ్రజ్యోతి. 23. 4 82) అలాగే నేటి యువతలో నానాటికి పెరిగిపోతున్న మోహాన్ని- కామ ప్రవృత్తిని అభివ్యక్తం చేసిన కవితలు వున్నాయి. ఉదాహరణకి ఎన్. వి. ఆర్ కవిత 'వందర్లు'లో రూముల నిండా అమ్మాయిల అర్థనగ్న చిత్రాలను అతికించి పెట్టుకునే విద్యార్థుల మనోవృత్తిని స్పష్టం చేశారు-

కొత్త సంవత్సరారంభంలో
రంభల కేలండర్లు
యువకుల రూముల్లో
రంగుల కలల వందర్లు

వర్తమాన పరిస్థితుల వికృత రూపాలను స్పష్టం చేసేందుకు వ్యంగ ధోరణిలో పౌరాణిక పాత్రల స్వభావాలకు విరుద్ధమైన లేక తద్రూపమైన స్వభావాలను స్పష్టం చేస్తూ కవితలు వ్రాయడం మరోవిశేషం. యథార్థ పరిస్థితుల తీవ్ర పరిణామాల పట్ల వ్యక్తి మనసులో కలిగే జుగుప్సను మరింత తీవ్రతరం చేసేందుకే ఈ ప్రయత్నం. బెజవాడ గోపాలరెడ్డిగారి 'పోర్టు ఫోలియోలు' అన్న కవిత దీనికి ముఖ్య ఉదాహరణగా తీసుకోవచ్చు—

గౌరవనీయులు బృందావన ముఖ్యమంత్రి
పదే పదే పోర్టుఫోలియోలు మార్చుడు.
గౌరవనీయ సత్యభామకు-
సల్లాపాలు, క్రీడలు, ప్రణయ కలహాలు.
గౌరవనీయ రుక్మిణికి—
పూజాపునస్కారాలు,దేవాలయాలు,తులసీవనాలు
గౌరవనీయ రాధికు
ప్రణయ తన్మయత్వము, యమునా
సైకతాలు,నెమళ్ళ పెంపకం,తమాలనికుంజాలు
అప్పగించి పై పెత్తనం సాగిస్తుంటాడు.
మహిళాభ్యుదయము, సాంస్కృతిక
వ్యవహారాలు, పశుపోషణ
తానే స్వయంగా నిర్వహిస్తాడు.

(ఆంధ్రజ్యోతి 18. 8 82.)

ఒక్కోసారి పౌరాణిక యితివృత్తాలలో వివరింపబడిన సత్యానికి నిజజీవితంలో ఎదుర్కొంటున్న సమస్యలకు పొత్తుకుదరక మనసులో ఏది సరియైనది,

ఏది కాదు అన్న ప్రశ్న తలఎత్తుతుంది. పురాతన సాంఘిక విలువల పట్ల, నియమాల పట్ల అనుమానం వస్తుంది—

కుంతి రాజ్యమాత
మేరి పూజ్యమాత
క్షణం వల్లు మరిచిన
నా కడుపులో అతను
నలుగురిలో నేను,
చుట్టూరా చూపుడు ! !

ఈ రకంగా సామాజిక పరిస్థితులలో అపూర్వమైన క్రాంతివచ్చి, యిప్పటి పరిస్థితులకు సరిపడని జీవిత విధానంలోనూ మార్పు రావాలన్నా, మన సాంస్కృతిక విలువల పునఃస్థాపన జరగాలన్నా మేథావి అయిన కవే పూనుకోనక్కర్లేదు. సామాజిక పరిస్థితులను- వ్యక్తుల మనోవృత్తులను యథాతథంగా పాఠకుల ముందుంచటం వరకే అతడి విధి సమస్యలకు సమాధానం చెప్పవలసిన బాధ్యత అతడి మీదేం లేదు. ఉండవలసిన అవసరమూ లేదు. ప్రజలు-పాఠకులు కావ్య పఠనంద్వారా స్వయంగా ఆవిషయాల గురించి ఆలోచించి సమాధానం కోసం అన్వేషించడం ముఖ్యం. సమాధానం. పరిష్కార మార్గం వారికి ఎప్పటికి దొరుకుతుంది అన్నది మాత్రం యింకా వేచిచూడవలసిన విషయంగానే మిగిలిపోయింది.

నరకాన్ని చేయాలి స్వర్గ ఖండము
విషం విరిగి కావాలి అమృత భాండము
హృదయంలో అనురాగం కుసుమించేలా
మదనుడు చేబూనాలి ఇక్షుదండము.

'జయదుంధుభి'- డా. దాశరధి

ఆంధ్రప్రభ 31. 8. 82

అన్న కవి ఆశ - ఆశయం వాస్తవంగా మారుతుందేమో చూద్దాం.

లెక్చరర్ పి. జి. కాంప్లెక్స్
డి. బి. హెచ్. పి. సభ,
ఖైరతాబాద్,
హైదరాబాద్-4

# అబ్సర్డ్ నాటకాలు–1

—శ్రీ వేమూరి ఆంజనేయశర్మ

అబ్సర్డ్ నాటకాలు దాదాపు 1945 నుండి 1965 రకు ఇరవై సంవత్సరాలు పాశ్చాత్యదేశాలలో ప్రముఖస్థానాన్ని వహించినవి. ఆ నాటకాలు బుద్ధి వులీన్ని, మేధావుల్నీ బాగా ఆకర్షించినవి. బెకెట్, అయె నెస్కో, పింటర్, జెనే, ఆల్బీ ఆదామోవ్ వంటి రచ యితలు అనేక నాటకాలు వ్రాసి ప్రజాదరణ పొందారు. బెకెట్‌కు నోబుల్ బహుమతి గూడా లభించింది. భారతదేశంలో గూడా వివిధభాషల్లో ఇటువంటి నాటక రచన జరిగింది. పెద్దలు సంస్కృత నాటకం మృచ్ఛకటికాన్ని అబ్సర్డ్ నాటకంగా పరిగణిస్తున్నారు. ఏమైనా ఈ నాటకాలు విశ్వవ్యాప్తి పొంది విశ్వనాటక సాహిత్యంలో ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకొన్నవి

ఈ నాటకాలు ఏమిటి ? వాటి రచనా శిల్పమేమిటి? అవి ప్రతిపాదిస్తున్న దేమిటి ? మొదలైన విషయాలను సంక్షేపంగా చర్చించడమే ఈ వ్యాసాల ఉద్దేశ్యం.

ఈ నాటకాలకు మూలపురుషులు అస్తిత్వవాదులు. కామూ తన మిత్ ఆఫ్ సిసిఫస్ అనే పుస్తకంలో అబ్సర్డ్ శబ్దాన్ని నిర్వచించాడు. అబ్సర్డ్ అనే పదం ఈనాడు ఒక రూఢశబ్దమయింది దానికొక విశేషార్థం ఏర్పడింది ప్రసిద్ధ విమర్శకుడు మార్టిన్ ఎస్లిన్ ఆ శబ్దాన్ని, ఆ శబ్దం వెనకనున్న దార్శనికతత్వాన్ని వివరించాడు. ఈ నాటకాలకు అబ్సర్డ్ శబ్దాన్ని ఆయనే జోడించాడు. ఆక్స్‌ఫర్డ్ డిక్షనరీ లోనూ, ది పెంగ్విన్ డిక్షనరీ ఆఫ్ థియేటర్‌లోనూ ఈ శబ్దాన్ని నిర్వచిస్తూ జాన్ రసెల్ 1950 సంవత్సరం నాటి కొంతమంది నాటక రచయితల సమూహంతో దానికి సంబంధాన్ని కల్పించాడు. ఆ రచయితలు మానవ జీవితాన్ని గురించి తమతమ దృక్పథాలతో ఆలోచిస్తూ మానవ జీవితంలోని ఉద్దేశ్యరాహిత్యాన్నీ, ప్రయోజనశూన్యతనూ, మూల్యవిహీనతనూ నాటకరూపంలో అభివ్యక్తం చేశారన్నాడు ఇర్వింగ్ వార్డిల్ పండితుడు అబ్సర్డ్ నాటకాల ప్రత్యేకతను వివరిస్తూ ఆ నాటకాలు మానవుని బాహ్యజీవితంకంటే అంతరంగిక జీవితాన్ని చిత్రిస్తున్నవనీ, ఫాంటసీ, యథార్థము రెండింటి మధ్య స్పష్టమైన విభజనరేఖ వుండదనీ, కుంచించుకోవడం, వ్యాప్తిని పొందడం కాలధర్మమనీ, ఈ విషయాలను వ్యక్తీకరించడం ఈ నాటకాలు చేసిన పని అనీ, ఈ నాటకకారులు జీవితంలోని నిరుద్దేశ్యతత్వాన్నీ, ఆదర్శ విహీనతనూ చిత్రిస్తున్నారనీ అన్నాడు. అబ్సర్డ్ నాటకకారుడు ప్రవాహమయమైన వాతావరణంలో దృశ్యాత్మకరూపంలో మానసిక స్థితులను చిత్రించి మానవ జీవితంలోని ట్రాజడీని కన్నులకు గట్టేటట్లు చేస్తున్నాడు. తనకున్న అర్థాన్నీ, లక్ష్యాన్నీ పోగొట్టుకొన్న మానవసృష్టిని ఒక ప్రత్యేక దృష్టితో ఆ నాటకకారుడు దర్శిస్తున్నాడు. అతని రచన వ్యంగ్యాత్మకంగా వుంటుంది. అతడు సమాజాన్ని కటువుగా విమర్శిస్తున్నాడు. అతని దృష్టిలో భగవంతుడే గాదు మానవుడు గూడా, మరణించాడు. మృత్యువు, జీవితం, ఏకాకిత్వం ఇవి అతని సమస్యలు. ఆ సమస్యల్ని విశ్లేషించడానికి నాటకాలలో అతడు ప్రయత్నం చేశాడు.

మొదటి ప్రపంచ యుద్ధం కారణంగా ఏర్పడిన పరిస్థితిని బుద్ధిజీవులు గ్రహించారు. రెండో ప్రపంచ

యుద్ధంతో పరిస్థితి మరీ తారుమారయింది. మనుష్యుడు జన్మ, మృత్యువు ఈ రెండింటి మధ్యగల జీవితాన్ని గడపడమెలా అనేది పెద్దసమస్య అయిపోయింది. సహజ ప్రవృత్తుల్నిబట్టి మానవుడు జంతువు. చేతన కారణంగా ఆ ప్రవృత్తుల్ని వశంలో బెట్టుకొని అతడు మానవుడవుతున్నాడు. తానుచేసే పనుల్ని బట్టి దానవుడు లేక దేవత అవుతున్నాడు. తన సహజ ప్రవృత్తుల పోషణకు ప్రయత్నిస్తే అందుకే జీవిస్తే—మనుష్యత్వాన్ని పోగొట్టుకొంటాడు. కేవలం చేతన వశవర్తుడైతే అతని జీవితమే నిస్సారమవుతుంది. సహజత్వాన్ని పోగొట్టుకొనడమవుతుంది. చేతన ప్రభావం వలన ఏవేవో వ్యాపకాలు పెట్టుకుంటే సహజ ప్రవృత్తులకూ ఆ వ్యాపకాలకూ మధ్య సంఘర్షణ ఏర్పడుతుంది. అసంగతులు విసంగతుల మధ్య జీవించలేక నిరాశజెంది మనుష్యుడు ఆత్మహత్య చేసుకొంటే అసలు జీవితమే వుండదు. అస్తిత్వమే వుండదు. శరీరమే లేనిది జీవితమేమిటి? ఇది పెద్ద సమస్య. ఇటువంటి పరిస్థితిని అబ్సర్డ్ నాటకాలు చిత్రిస్తున్నవి. సమస్యల్లో చిక్కుకొన్న మానవమనస్తత్వాన్ని విశ్లేషించడం ఈ నాటకాలు చేస్తున్న పని. సుఖదుఃఖాలూ, ఆనంద నిర్వేదాలేగాక మానవుని అంతరంగంలో కొన్ని చీకటిగుహలున్నవి. ఆగుహల్లో జీవిస్తున్న ప్రతి వ్యక్తి అభిశప్తుడే. తన అంతరంగంలోని ఆ గుహలను గుర్తించి వాటి తత్వాన్ని ఆకళింపు జేసుకొని జీవితం సాగించాలి. అది మానవుని సమస్య. దానిని గుర్తించలేక, నిరాశ, నిస్పృహలకు లోనై జీవితాన్ని లాగలేక- బరువు మోయలేక, మూల తత్వాన్ని గుర్తించనూలేక నిస్సహాయుడవుతున్నాడు మానవుడు. ఈ రహస్యాన్ని గుర్తించమంటాడు అబ్సర్డ్ నాటకకారుడు. నిజానికి ఉన్న ఇరవైనాలుగు గంటల్లో ప్రతిదినం ఇరవైమూడున్నరగంటలు మనం వ్యర్థంగా గడుపుతున్నాము. ఒక అర్థగంట మాత్రమే సార్థకంగా జీవిస్తున్నాము. కళలూ, సాహిత్యమూ మొదలైనవన్నీ ఆ ఒక్క అర్థగంట జీవితాన్ని మాత్రమే వ్యక్తీకరిస్తున్నవి. ఆ అర్థగంటలో గూడా ఒక్కక్షణం మాత్రమే ఉద్దీప్తంగా వుంటుంది. ఆ క్షణాన్ని వ్యావహారిక పరిభాషలో నిష్క్రియత క్రియారహితత్వం అనీ, దార్శనిక పరిభాషలో నియతి అనీ అంటున్నారు. జేమ్స్‌జాయస్ కాఫ్కా వంటి మహారచయితలు ఆ క్షణాన్ని దృష్టిలో పెట్టుకొని మానవుని జీవితాన్ని పరిశీలించే కొత్త మార్గాన్ని మనముందుంచారు. దానితో దృష్టి మారింది. విధానం మారింది సార్థకత నిరర్థకత అయింది. మూల్యాలు మూల్యవిహీనతలుగా, నాయకుడు అనాయకుడుగా, కవిత అకవితగా, నాటకం అనాటకంగా మారిపోవటం జరిగింది. డార్విన్, ఫ్రాయిడ్ వంటివారు దృష్టి మారడానికి విశేషంగా తోడ్పడ్డారు. మార్క్స్ ఒక కొత్త పరిభాషను మన ముందుంచాడు. దాని రూపం వేరు. విధానం వేరు. దానిని గురించి వేరుగా ఆలోచించవలసి వుంటుంది. ఏమైనా మానవ జీవితంలో నిరర్థకంగా గడప బడుతున్న ఇరవైమూడున్నర గంటలను గురించి పరిశీలన జరగవలసివున్నది. సక్రియ మనుష్యుడు నిష్క్రియ మనుష్యుడు ఇది ఒక విచిత్ర పరికల్పన. కాఫ్కా, జాయిస్, సార్త్రి అయనెస్కో, బెకెట్ వంటి వారిని ఆ పరికల్పన నిశితంగా ఆలోచింపజేసింది. జరిగిన రెండు విశ్వ యుద్ధాలూ అందుకు బాగా దోహదం చేశాయి. మహాభారతయుద్ధం జరిగిన తరువాతగూడా ఈ స్థితిని ఊహించడం జరిగినట్లు మనవారు అంటున్నారు. మొదటి విశ్వయుద్ధం, రెండవ యుద్ధానికి ప్రాతిపదికను ఏర్పాటు చేసింది. మానవునికీ మానవునికీ మధ్యనున్న స్నేహతంతువుల్ని అది ఛేదించి వేసింది. మానవుల మధ్య వుండవలసిన ఆత్మీయతను ఛిన్నాభిన్నం చేసివేసింది ఆ యుద్ధాలలో నూటికి తొంభైఅయిదు మంది చంపబడ్డారు. కొంత మంది ఏమైనారో తెలియదు. ఒక మిగిలినవారు

జీవించడం సమస్య అయింది. యుద్ధం చేసిన దేశాలు వారి బాధ్యతను స్వీకరించడం మానివేశాయి. 19వశతాబ్దంలో వికసించిన యంత్రవిప్లవం రెండోయుద్ధం నాటి పూంజీవాదంగా మారిపోయింది. మనుష్యుడు యంత్రంలోని ఒక పనిముట్టుగా తయారుచేయబడ్డాడు.

రెండో విశ్వయుద్ధం వలన ఏర్పడిన పరిస్థితీ, సాంఘికతాభావలోపం, పూంజీవాదం నిర్మించిన ఆంతరంగిక అరాజకతా, అది చేస్తున్న వికటాట్టహాసం అబ్సర్డ్ నాటకరచనకు కారణమైనట్లు కనపడుతున్నది. అబ్సర్డ్ నాటకాలకు పూర్వమున్న రూపమేమిటి? అవి చేసిన పని ఏమిటి? అని ఆలోచిస్తే అనాగరికుణ్ణి నాగరికుణ్ణి చేసేందుకూ, ప్రవృత్తుల ఉదాత్తచిత్రణ చేయడానికి అవి కృషి చేశాయి. అందుకు బదులుగా సామయిక సత్యాన్ని గుర్తించు, ఆదర్శ వాక్యాలతో పని జరగదు. జీవితసత్యాన్ని గుర్తించు, కేవలం భావుకతవలన ప్రయోజనం లేదు అనే నినాదాలను అబ్సర్డ్ రచనలు అందజేసినవి. నాగరికుణ్ణి చేయవలెననే ప్రయత్నంలో మానవుణ్ణి ఇంకా అనాగరికుణ్ణి చేయడం జరిగిందనీ, అతని అసలు వ్యక్తిత్వం మరుగుపడి సాంఘికవ్యక్తిత్వం ఆ స్థానాన్ని గ్రహించిందనీ ఈ నాటకాలు స్పష్టం చేస్తున్నవి. మానవజాతిగౌరవ గ్రంథాలు ఈ విశ్వంలో చాలా వెలువడినవి. వాటిలో ఆత్మ సాక్షాత్కారం కంటే, మానవ సహజరూప చిత్రణం కంటే, సాంఘికమైన ఆకాంక్షల చిత్రణే ఎక్కువగా జరిగింది. సామాజికతను, సంస్కారాలను వదలడం మహాపాపంగా భావించబడే మనోవృత్తిని మనలో జీర్ణింపజేయడం జరిగింది. ఈనాడు జరుగుతున్నదేమంటే ఒకవ్యక్తి ఎంత సామాజికుడు కావాలో అంతకంటే ఎక్కువ సామాజికుడవుతున్నాడు, సమాజవిరోధి కూడా అంతే. రాజనీతిజ్ఞుడు అధిక రాజనీతిజ్ఞుడవుతున్నాడు వైజ్ఞానికుడుగూడా అధిక వైజ్ఞానికుడవుతున్నాడు. ప్రతిచోటా ఈ "అతి" ప్రవేశిస్తున్నది. అందువల్లనే వాతావరణం కలుషితమవుతున్నది. అబ్సర్డ్ నాటకం ఈ "అతి"ని బహిష్కరించమంటున్నది నాగరికత కంటే ఆ పేరుతో నాగరికత ముసుగులు ఎక్కువైనవి. ఆ ముసుగుల వలన మనుష్యుడు దోవదప్పి పోతున్నాడు. ఈనాడు మానవత అనే పేరుతో అసలు దానిని వదలి ముసుగులకు ఎక్కువ మనం ప్రాధాన్యానిస్తున్నాము. సదవకాశాలూ, సౌకర్యాలూ లభించిన కొంతమంది అతినైతికతాసిద్ధాంతాలు వల్లిస్తున్నారు. పెద్దపెద్ద ఉపదేశాలుచేస్తున్నారు. అసలు ఈ మహానుభావుల వల్లనే ఎక్కువ ప్రమాదం ఏర్పడుతున్నది. అబ్సర్డ్ నాటకకారుడు ఆ మహానుభావులను గురించి బహుపరాక్ అని హెచ్చరిస్తున్నాడు. ఈ నాటకకారులు సామాజికత తాలూకు సహజ స్వరూపానికి వ్యతిరేకులు కారు. కాని ఈ అతి అంటే వారికి మంట. హేతువాద పద్ధతిలో జీవిత విశ్లేషణ చేయడం వారి లక్ష్యం. వారు ప్రతిపాదిస్తున్న నిష్క్రియతావాదం కర్మసాపేక్ష్యం. కర్మఫలం లభించక పోయినా వ్యక్తి అలవాటుగా కర్మచేస్తుంటాడు. కర్మఫలం ఎందుకు లభించడంలేదు? కర్మ చేసినవానికి ఫలప్రాప్తి జరగవలె గదా? ఎందుకు జరగడంలేదు? ఇది అబ్సర్డ్ నాటకకారుని సమస్య. ఈ సమస్యను గురించి అతడు ఆలోచిస్తున్నాడు. అతడు ప్రబోధించేది నకారాత్మక నిష్క్రియతగాదు. అదే అయితే అబ్సర్డ్ నాటకాలన్నీ ఆత్మహత్యతో అంతం గావాలి. అట్లా జరగడంలేదు. జీవితంలో అసంగతి, నిష్క్రియతలువుంటున్నవి. కాలాతీతమైన అనంత నిరీక్షణ అతని పాలబడుతున్నది జీవించడం అతని కొక నిరర్థకక్రియగా కనబడుతున్నది. "సుసంగతిని" ఏర్పరుచుకొనవలెనంటే నాగరికత ముసుగు అడ్డం వస్తున్నది. దానిని తొలగించేదెట్లా? సంగతస్థితి సామాజిక మవుతున్నది- ఆరూపంలో దానిని గుర్తించడం జరుగుతున్నది. అసంగతినీ, సుసంగతినీ సంస్కారాలముసుగుల ఆధారంమీద

గుర్తించడం మనం చూస్తున్నాము. అసంగతి, సుసంగతి అనేవాటి రూపకల్పన జీవితసత్యం మీద గాక కుహనానాగరికత, రూఢమైన సామాజిక బంధనాలు మొదలైనవాటి ఆధారంగా జరుగుతున్నది. దానిని తొలగించాలి. మనం ఆలోచిస్తూ మన ఆలోచనలు తర్కసంగతంగా వుండాలంటున్నాము. ఇది వొక మెట్టు అయితే ఆ తర్కసంగతత్వం ఎట్లా ఏర్పడుతున్నది? తర్కసంగతత్వానికి ఆధారమేమిటి? మన కుహనానాగరికత ఆ తర్కసంగతత్వాన్ని ప్రభావితం చేస్తున్నది. సమాజం గూడా అందుకు కారణం. సామాజిక బంధనాల చరిత్ర విచిత్రమైనది. దేశ, కాల, పరిస్థితుల వలన ఆబంధనాలు లేక ఆచారవ్యవహారాలు మారిపోతున్నవి. జాతి ఆలోచనా విధానంలో ఎన్నో మార్పులు వస్తున్నవి. నిన్నటి ఆచారాలు ఈనాడు అనాచారాలు. అంటే ఏర్పడిన పరిస్థితులూ, రోజు రోజుకూ మారుతున్న సామాజిక వాతావరణం, ఆలోచనా విధానాలూ, చిలుక పలుకులవంటి ఆదర్శ వాక్యాలూ తర్కసంగతత్వం అనేదానిని ప్రత్యక్షంగానో అప్రత్యక్షంగానో ప్రభావితం చేస్తున్నవి. పరంపరాగతంగా ఏర్పడిన రూఢభావాలు, అంతవరకు ఏర్పడిన నిర్ణయాలు, కోర్టు తీర్పులు లాగా తర్కసంగతత్వానికి రూపం కల్పిస్తున్నవి. ఏది ఏమైనా తర్కబద్ధంగా వున్నా లేక పోయినా మానవుడు జీవిస్తున్నాడు. అనేకమైన తర్కబద్ధంగాని సన్నివేశాలనూ. సంఘటనలనూ. జీవితంలో ఎదుర్కొంటున్నాడు. కొన్నిటిని చూచి మానవుడు నిర్విణ్ణుడవుతున్నాడు. నిరాశపడుతున్నాడు అయినా జీవిస్తూనే వున్నాడు. జీవిస్తాడు జీవించాలి. అయితే అసలు సంగతిని అతడు గ్రహించాలి. ముసుగుల్ని తోసివేయాలి. ఛేదించి వేయాలి బెకెట్ నాటకం వెయిటింగ్ ఫర్ గోడోలో లాగా మానవ జీవితంలో నిరీక్షణ ఒక్కటే మిగిలినా విచారపడవలసిన దేమీ లేదు. అది ఒక్కటే నిత్యసత్యంగా కనబడుతున్నదనే సత్యాన్ని గ్రహించాలి. ఈనాటకాలు జీవితంలోని నిష్క్రియతనూ, అసంగతులు విసంగతులనూ, మూల్య హీనతనూ, శిఖరాగ్రానికి చేరిన "విసుగు"నూ చిత్రిస్తున్నవి. ఇవి మానవుని ఆంతరంగిక జీవితానికి చెందినవి. అవి అంతరాంతరాళాలలో దాగి వుండే నిత్య సత్యాలు. వాటిని అబ్సర్డ్ నాటకకారులు చిత్రించారు. రెండో విశ్వ యుద్ధం జరిగిన తరువాత ఏర్పడిన పరిస్థితిని గురించి పైన మనవి చేయడం జరిగింది. ప్రపంచంలోని అన్ని దేశాలలోనూ నిరుద్యోగ సమస్య పెరిగింది ఆర్థికస్థితి తారుమారయింది. ప్రతి దేశం సంఘర్షిస్తున్నది. జాతి అన్నా, దేశమన్నా గూడా నిష్ఠలేని పరిస్థితి ఏర్పడుతున్నది. జీవితపు విలువలు రోజురోజుకూ మారిపోతున్నవి. ఆ పరిస్థితులు కారణంగా మానవునిఆంతరంగికజీవితం, బాహ్యజీవితంగూడా దుర్భరమైపోతున్నవి. ఆ థీమ్‌ను ఈ నాటకాలు అనుసరించినవి. కాఫ్కా వ్రాసిన ట్రయల్ నవలను ఆంద్రేజీద్, జ్యాం పాల్‌లుయీ గారలు నాటకంగా మార్చి పారిస్‌లో ప్రదర్శించారు. దీనితో అబ్సర్డ్ నాటకయుగం ప్రారంభమయింది. ఆ నాటకకారుల దృష్టి వ్యక్తి నిష్ఠం. అందరూ కలిసి ఒక ఉద్యమంగా ప్రారంభించకపోయినా మొత్తం మీద అందరూ వెలువరించిన భావం ఒక్కటే.

ఇరవయ్యో శతాబ్దానికి పూర్వంగూడా వివేకావివేకాల ద్వంద్వం నాట్యచింతనా విధానంలో కనబడుతున్నది. పాశ్చాత్య దేశాలలో తర్కసంగతవిధానాన్ని అనుసరించి కొంత సత్యానుసంధానం జరిగింది. కాని ఈనాటి స్థితి అదిగాదు. యథార్థాన్ని విస్మరించడానికి

పీలులేదు? దేనినో ప్రతిష్ఠించాలి. జీవిత నిజస్వరూపాన్ని వెలువరించాలి. అందుకు ప్రయత్నిస్తే అంతా స్వప్నప్రపంచంగా మారుతున్నది. ఆ స్వప్న ప్రపంచాన్ని దృష్టిలో పెట్టుకొని సాహిత్యరచన సాగుతున్నది. నాటక రచన జరుగుతున్నది. మానవజీవితానికి అర్థం కనబడడంలేదు. అనుసరించబడే ఏ నిర్మాణసూత్రమూ కనబడడం లేదు. అది వివేకసమ్మతంగానూ లేదు. లేక ఏదో ఒక సంగఠన సిద్ధాంతంమీద గూడా ఆధారపడి లేదు పరంపరాగతంగా ఉన్న నాటకాలు జీవిత రహస్యాన్ని వ్యక్తం చేయలేక పోతున్నవి అది చేద్దామని ఈ నాటకకారుల తపన.

ప్రఖ్యాత విమర్శకుడు మార్టిన్ ఎస్లిన్—రచనాకారుని అంతరంగిక విశ్వంతో అసంపృక్తంగా వుండి ఏవో చిన్నచిన్న పెద్దపెద్ద బయటి సమస్యల్ని, పాత్రల నియతినీ చిత్రించడంలో అబ్సర్డ్ నాటకాలకు సంబంధం లేదు. బాహ్యజీవితాన్ని, ఘటనలనూ చిత్రించడం వాటికి వ్యాఖ్యలు కల్పించడం వాటి ధ్యేయంకాదు, ఒకానొక వ్యక్తియొక్క మూలభూత అంతరంగిక స్థితిని వివరించడం వాటి పని అస్తిత్వజ్ఞానాన్ని కలిగించడమే వాటిలక్ష్యం అన్నాడు. అంతేగాక మానవుని అచరణా, నైతిక సూత్రాలూ వంటివాటిని అవి పరీక్షించవు, పరిష్కరించవు అనిగూడా అన్నాడు.

# సాహిత్యగోష్ఠి

## ఋతు చక్రం

ప్రకృతి అవనిపై చూపే గుణషట్కం ఋతుచక్రం మనిషి మనిషిపై చూపే గుణషట్కం, అరిషట్కం. మనిషి మనస్తత్వంలోని అరిషట్కమే విస్తృతి చెందితే ఋతు చక్ర మౌతుందని నిరూపిస్తున్నది. డా. సి. నారాయణరెడ్డి గారి కావ్యం– ఋతు చక్రం

"ఋతుచక్రమట్లు జీవిత చక్రమనిశమ్ము
భ్రమణ శీలమ్ము"                    — పుట. 83

అన్న మాటలు పై ఊహకు దోహదం కల్పిస్తే -

1. కుసుమాస్త్రు భాస్వంతమ్ము వసంతమ్ము - వసంత ఖండం - పుట. 1. (కామం)

2 రుద్రుని క్రోధమా ? - గ్రీష్మ ఖండం - పుట. 15 (క్రోధం)

3. కడలిలోని ఉప్పునీరు కడవల కొద్దిగ గడగడ ద్రావ, కడుపు నులిపెట్టినదా ? మూల్గిన పీమబ్బులు — వర్షా ఖండం— పుట. 32 (లోభం)

4. రాత్రులందున కల్వపువ్వులే
నేత్రములుగా; పవళులందున
కమలములె కన్నులుగ సరసుల
గాంచినది శారద విలాసిని - శరత్ ఖండం — పుట. 46. (మోహం).

5. శిశిరమ్ము వచ్చె వచ్చె హిమర్తు చండశా
సనమింక రెండు మాసములు పొడిగినయట్లు
— శిశిర ఖండం - పుట 74. (మదం)

6. పైకి చల చల్లగా ప్రసరించు శిశిరవా
తములో విషమ్మెంత దాగియున్నదొ కాని
స్పర్శమాత్రమున వృక్ష సహస్ర పత్రములు
తెల్లతెల్లనైపోయి తెగి నేల పొర్లాడె.
— శిశిర ఖండం — పుట. 80. (మాత్సర్యం)

అన్న డా. రెడ్డి గారి వాక్కులు 'ఋతు చక్రం'లోని ప్రతి ఆకులోనూ మనిషిలోని అరిషట్కాన్ని వరుసగా మెరిపిస్తున్నాయి.

ఈ వరుసను సమీక్షిస్తూ—

"ఆత్మదర్పణముగ పర్యాలోకనము సేయ
ఆరు ఋతువులు వట్టి పేరుకే; ఈ ప్రకృతి
అణ్వణువులో గుప్తమైన చిన్మయ శక్తి
ఎగదన్నినట్టి బాహిర చిహ్న పంక్తులవి."
పుట. 83.

అంటూ వివృతి చెందిన అరిషట్కమే 'ఋతు చక్రం' అని బలపరుస్తున్నారు రెడ్డిగారు.

ప్రతి నవ్యభావనతో పరిశ్రమించడం నిత్య పురోగమన శీలి ఐన మహాకవి ప్రథమ లక్షణం. ఋతు వర్ణనం సాహితీ జగత్తుకు కొత్తది కాకపోయినా—ఆ పొలపుంతలో పొడిచిన రెడ్డి గారి పాళీ కొత్త మెరపు మొలకలు, సహృదయ చిత్త వశీకరణాలు.

ఆదికావ్యంతోనే ఆరంభించి అక్కడక్కడా సాగిన ప్రకృతి ఋతు వర్ణనకు ప్రథమంగా కావ్యత్వాన్నిచ్చింది కాళిదాసు 'దూతమేఘం'. ''ధూమ జ్యోతి స్సలిల మరుతాం సన్నిపాతః'' అంటూ తన 'దూత' స్వరూపాన్ని నిరూపించాడు కాళిదాసు. అది మనస్సులో తళుక్కుమన్నదేమో !- రెడ్డి గారు —

''ధూమకాంతి సలిల మరుత్తుల కూడిక కాదు మబ్బు;
జీవలక్షణమ్ములు పుంజీభూతమ్మను బింబము
మనుజుల వలెనే నవ్వును; మరు నిముసములో ఏడ్చును

అపుడే గ్రుడ్లురిమి చూచు; అపుడే శాంతము వహించు"
పుట. 35.

అంటూ తమ నవ్యాలోకాన్ని ప్రసరించడమే
కాక —

''మానవుల మనస్సులలో మరుగుపడిన ప్రవృత్తులీ
మబ్బుల రూపములో వెలి కుబ్బినట్లు కనిపించును''.
పుట. 34

అంటూ 'ధూత మేఘం'లోని ఆత్మాశ్రయ కవితారీతిని వ్యాఖ్యానిస్తున్నారు.

ఇంత చెప్పి 'ఋతు చక్రం'లో విప్రలంభ స్థితిలోఉన్న కవి మనస్సు

'కనుల కద్దముగ ఈ గగనమ్ము లేకున్న ఎంత బాగుండు''
పుట. 8.

అనుకొంటూ —

"ఇల్లాలి ఊరున్న
పున్నెంవు దెసవైపు పుల్కు పుల్కున జూచి
కదలి'' పుట. 9 — పోయింది తానే.

దౌత్యాన్ని నిర్వహిస్తూ ఇదీ ఇక్కడి నవ్యత.

రెడ్డిగారి కవితా విష్కృతి —

''గుండెలోన రసవదర్థ ఖాండమ్మును దాచి నమ్ర
సుందరమ్ముగా కదలిన శ్లోకమ్మా పయోధరము''
పుట. 34.

అన్నట్టుగానే ఉంటుంది కాని, ''శ్లోకశ్లోకత్వ మాగతః'' అన్న తటాలుమనే పద్ధతి కాదు. ఇదీ నవ్యతే. ఒక వర్ణన —

''సెనగ చాళ్ళందు దాగిన దోస తీగలను
గనవేదపండితులు జ్ఞాపకము వచ్చెదరు;
అవి తమంతటతామె అగుపడవు; పైకి
రప్పించినఒక్కొక్క తీవియ ఫల శతప్రదము''
పుట. 31

చెప్పే తీరులో కొత్తదనం అటుండగా ''నరత్న మన్విష్యతి మృగ్యతేహితత్'' అన్న కాళిదాస సూక్తికి మారాకు వాత్తినట్టుగా లేదూ ?

వర్షధారల్లోని అందాన్ని

"అంతమీదనున్న నింగి, అంత కింద నున్న నేల,
పులుగడిగిన ముత్తెపు చేరులలో ముడివడిపోయెను''
పుట. 37.

అని మనోహరంగా వర్ణిస్తూనే,

"హరి విల్లును పట్టుక వ్రేలాడి; జారుబండలాడి, అలసి నప్పుడొక్క మబ్బు తలగడగా, ఇంకొక్కటి పానుపుగా పవ్వళించె" పుట. 41.

అంటూ బాల్యక్రీడలకు అర్రులుచాస్తున్నది కవిహృదయం.

ఋతు ప్రభావాల్లో లోకజ్ఞత మెరపించిన అంశాలు కావ్యంలో సముచితంగా ఉన్నాయి.

గ్రీష్మంలో -

''రప్పమను సుడిగాలి తాకిడి
కుప్పరమ్మున నెగసి యాడెడు
ఎండుటాకులు; పెద్ద పదవి గ
డించు అల్పులవోలె కన్పడె. "పుట. 17.

"జన పదమ్ములలోన వేసవి
చండ శాసన మిట్లు సాగెను
ఎన్ని గొడ్డలి కాట్లు వడిన
ప్రజేప్సితమ్ములు తీగసాగెను" పుట. 22.

అనడంలో మనిషిలోని ఆశాజీవితాన్ని అచ్చుపోయడం జరిగింది.

కృషీవలుల కష్టాలను పూసగ్రుచ్చినట్లు వర్ణించిన 'వర్షా ఖండం' కొసమెరుపుగా-

"రేపటి జీవన విభాత రేఖలకోసమ్ము నేడు
నెత్తురు చుక్కల నివాళులెత్తెడు జోదులు వారలు''
పుట. 44

అనడంలో రెడ్డిగారికి శ్రామికుల మీదున్న గౌరవ ప్రేమలు గుప్పుమంటున్నాయి.

కవితావిర్భావానికి కవి చిత్త సంస్కారం, మనో వికారం మూలకాలు. వీటిని అక్షరాకృతిలో పోసే మూస 'అంతర్దృష్టి' అదే రెడ్డిగారి మాటల్లో-

"ఏకాంత మందు నా
లోలోన త్రవ్వుకొని హేలగా నవ్వుదును." పుట. 7

ఆ పరిస్థితి కలిగినప్పుడే,
దృష్టి పూర్వమ్ము జగతీ రథమ్మిది యేమి
క్రొత్త నడకల నేర్చుకొన్నదీ సమయాన

అనుభూత పూర్వమీ అఖిల ప్రకృతి సీమ
క్రొత్త జిలుగులు కూర్చుకొన్నదీ నిమిషాన
పుట. 2

అనిపించి కవి 'మనోవికారానికి' దోహదం చేస్తుంది

ఎ. సుఖదుఃఖముల నొకించుకనైన పట్టించు కొనలేని
శైశవమ్మునకు దూరమైతి

బి. సుఖదుఃఖముల నొక్కచో పిండిపోసి గుట గుట
త్రాగి వేయు యోగుల నందు కోనైతి. పుట. 4.

అనే కవితలోని పూర్వార్థం జారిపోయిన స్థితప్రజ్ఞ స్థితిని తలపిస్తుండగా; ఉత్తరార్థం అది పొందే మార్గం లేదే అన్న బాధను సూచిస్తున్నది. ఈ రెంటి మధ్యనే పుడుతున్నది అచ్ఛమైన కళ- కవిత. పైరెండు అవస్థలూ భౌతికంగా తనకు అందక పోయినా; రెంటినీ కాదని ఆ ఆనందాన్ని అందించే కవిత కోసం పరితపించే మనోవికార సముద్దీపనం పై పంక్తుల్లో తళుక్కు మంటున్నది.

"నాలోన సత్త్వమ్ము జాలుగట్టినదయ్య!
అందుకే ఈ రసస్పందన స్థితిగల్గె పుట. 4

అన్నకవిత కవి చిత్త సంస్కారాన్ని సూచిస్తున్నది.

1. గుడిసెలోని మట్టి దివ్వె
గుడిసెలోపలి మణిదీపము
సమానమ్మలే రెండును
తమస్సులను కడిగివేయ. పుట. 66.

2. నాకు జూడ బ్రహ్మాండమె
ఏకైక కరండకమ్ము
దానిలోన స్నేహరమ్య
మై నిల్చెను పరంజ్యోతి. పుట. 67

అన్న పంక్తుల్లోని 'పరంజ్యోతి' కవిత. అదే మనిషిని సాధారణీకరణం చెందించి విశ్వాత్మ భావంతో నిండించి కవిగా వెలిగిస్తున్నది. పై రెండు కవితల్లోనూ కవితా మహత్త్వమే కాక-కవికి కావలసిన అర్హత-చిత్త సంస్కారమూ సూచిస్తున్నారు రెడ్డిగారు.

పై మనోవికారం-చిత్తసంస్కారం రెండే కవిత్వాన్ని కల్పించలేవు. ఆరెంటినీ జోడుగుర్రాల్లా పరుగెత్తించే ఆవేశమూ కావాలి. 'ఋతుచక్రం' కావ్యస్రష్టలో అది నైసర్గికంగా ఉన్నదని-

# "వెల్లువలో పూచిక పుల్లలు" ఒక అభిప్రాయం

నవ్యతనుకోరే సాహిత్యాభిమానుల అభిరుచులకు అనుగుణంగా యుగ జీవితాన్ని విశ్లేషిస్తూ, మనిషిని–అతడి అనుభవాలను – అనుభూతులను, ఆశలను – ఆవేదనలను అర్థం చేసుకునేందుకు పాఠకులను ప్రోత్సహించే విధంగా తన రచనను మలచుకుంటూ బాస్కరభట్ల కృష్ణారావుగారు "వెల్లువలో పూచిక పుల్లలు" అన్న నవల ద్వారా పాశ్చాత్య దేశాలలో ప్రచారానికి వచ్చిన "అస్తిత్వవాదం" అనే దార్శనిక సిద్ధాంతాన్ని తెలుగు పాఠకులకు పరిచయం చేశారు.

అస్తిత్వవాదులు ముఖ్యంగా ప్రతిపాదించే విషయం– మనిషి నిరర్థకమైన ఈ లోకంలోకి అసహాయుడుగా, ఒంటరిగా విసరివేయబడుతున్నాడేగాని తనకు తానుగా రాడని, ఏ ప్రయోజనం కోసం ఈ లోకంలోకి తీసుకు రాబడినాడో తెలియక–జీవితానికి అర్థంగాని, ప్రయోజనం గాని వున్నట్టు అనిపించక నిస్సారమైన బ్రతుకు సాగిస్తూ విశ్వవ్యాప్తంగా వున్న అసంగతుల–విసంగతుల మధ్య నిరాశ నిస్పృహలకు లోనవుతున్నాడు అని !

భౌతిక జగత్తు నిర్మాణం–వాటి స్థితిగతులు ఏవీ మానవుడి చేతిలోలేవు– ఏదీ అతడి ఇష్టప్రకారం జరగదు. అంచే పరిస్థితులను యథాతథంగా స్వీకరిస్తూ ముందుకు సాగటం కంటే వ్యక్తి చేయగలిగిందేమీ లేదు. అయితే తాను పరిస్థితులకు బానిస అయినా, పరిస్థితుల ప్రవాహంలో పూచిక పుల్లలా కొట్టుకు పోయినా, ఆ పరిస్థితులను అర్థం చేసుకుంటూ వాటికి అనుగుణంగా తన జీవన విధానాన్ని మార్చుకోగలిగిననాడు వ్యక్తి అస్తిత్వవంతుడు అవుతాడు. ఈ జీవితం ఏమిటి–దీని ప్రయోజనం ఏమిటి అనిప్రశ్నించుకుంచే జవాబు దొరకదు. జీవిగా వుట్టాక నిరాశ నిస్పృహలకు లోనుగాక తప్పదు – బ్రతుకు ఒక శాపంగా పరిణమించినా భరించక తప్పదు. ఇది జీవితం పట్ల అస్తిత్వవాదుల అభిప్రాయం.

ఈ అస్తిత్వవాద సిద్ధాంతం యొక్క ముఖ్యోద్దేశం మనిషి మొదట తనను తాను అర్థం చేసుకోగలిగేలా చేయటం శరీరవిజ్ఞానం, మన స్తత్వ శాస్త్రాలను ఆధారంగా చేసుకుని ఆత్మగత చింతనా పద్ధతి ద్వారా అంతర్గత సత్యాలను – సహజాను భూతులను–ప్రవృత్తులను గుర్తించే ప్రయత్నం చేయడం. ఇందుకు ముఖ్యంగా అతడికి సహాయపడేది శ్రద్ధ ! దీనినే స్పష్టం చేస్తూ ఆత్మనిష్ఠమైన పద్ధతి ద్వారా వ్యక్తి మొదట తన జీవిత విధానాన్ని గుర్తించే ప్రయత్నం చేస్తాడు అంటాడు కీర్కెగార్డు. అంచే మనిషి జీవితము – కర్మ – ఈ రెండిటి మధ్య పరస్పర సంబంధాన్ని స్థాపించే ప్రయత్నం చేస్తాడు. తను దేనిని విశ్వసిస్తాడో దాన్ని ఆధారంగా చేసుకుని ముందుకు వెళ్ళగలిగే సంకల్పబలం అతడిలో వుండాలి – ఆ తర్వాత సిద్ధించేటటువంటి వాస్తవికమైన అనుభూతి ఆధారంగా దాని విలువను గుర్తించవచ్చు. ఈ సంకల్పబలంతోనే వ్యక్తి కొన్ని ఆదర్శాలు, అభిరుచులు, ఏర్పరచు కుంటాడు. అవే జీవిత విలువలుగా మారతాయి. యుగ జీవితాన్ని బట్టి పరిస్థితులను బట్టి విలువలు మారుతుంటవి – అలా మారని పక్షంలో అవి మూఢనమ్మకాలుగా మారి మానవ ప్రగతికి అవరోధాలు కలిపిస్తవి ఒక విధమైన మానసిక సంఘర్షణకులోనై వ్యక్తి పూర్వపు విలువలను ధిక్కరిస్తాడు – తన అభిరుచులకు, ఆదర్శాలకు తగిన జీవిత విధానాన్నే ఎంచుకుంటాడు. అరకంగా అతడు తన ఆంతరంగిక అనుభూతిని దృష్టిలో వుంచుకుని మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా తన దృక్పథాన్ని మార్చుకున్నా తను చేసే పనులకు తానే బాధ్యత వహిస్తూ – తన తప్పొప్పులను గ్రహిస్తూ హేతువాద దృక్పథంతో జీవితాన్ని అర్థం చేసుకునే ప్రయత్నం చేయాలి అన్నది అస్తిత్వ వాదుల అభిమతం. అంచే వ్యక్తి అలవరచుకునే అభిరుచులు – ఆదర్శాలు. అతడు అవలంభించే పద్ధతులు, చేసే ప్రయత్నాలు – ఇవి ఎన్నో రకాలు. ఈ ప్రయత్నాలకు ఎన్నో అడ్డంకులు–ఎన్నో సమస్యలు కాని. జీవితప్రవాహం ఎక్కడా ఆగదు. ఏదో ఒకదానితో తృప్తిపడదు. వీలయినంత వరకు అడ్డంకులను తొలగించుకుంటూ, కోరుకున్నది పొందే ప్రయత్నం చేస్తూ తోటి వ్యక్తులతోను, పరిస్థితులతోనే గాక తనలో తాను సంఘర్షిస్తూ ముందుకు సాగటమే జీవితం. ఇది అస్తిత్వవాద సారం.

కృష్ణారావు గారి "వెల్లువలో పూచిక పుల్లలు"లో ముఖ్యమైన పాత్ర మధు. పరిస్థితులకు ఎదురీద లేక వాటికి అనుగుణంగా పూచిక పుల్లకు మల్లె కొట్టుకు పోయే వ్యక్తి

మధు. అతడికి ఎదురైన పరిస్థితులు అతడి జీవితాన్ని నడిపిస్తాయేగాని అందులో అతడి యిష్టాయిష్టాల ప్రసక్తి లేదు. అతడిలోని ఇడిపస్ కాంప్లెక్స్ అతడి స్వభావం పైన ఎంతో ప్రభావం చూపిస్తుంది. తల్లి ప్రవర్తన అతడి ముందు ఆకాశం ఎత్తున నిలబడింది. తన తల్లి వరలక్ష్మికి రంగనాయకులకి సంబంధం వున్నదని తెలిసిన తర్వాత ఆవూరు వెళ్ళడం గాని — తల్లితో ఆప్యాయంగా మాట్లాడటం గాని మానుకుంటాడు. తల్లి ప్రవర్తన అతడికి ఒక అబ్సెషన్. ఆ అబ్సెషన్ మూలంగా అతడిలో ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్ ఎర్పడింది. అందరూ తల్లి మూలంగా తనను చూసి నవ్వుతున్నట్టు అనిపిస్తుంది - అందుకే ఎవ్వ మొఖాన్ని భరించలేని స్థితికి వస్తాడు. అవమాన భారంతో ఒంటరిగా వుండటం అలవాటు చేసుకుంటాడు. అటు పిమ్మట ఆర్థికంగా తల్లి మీద ఆధారపడకూడదన్న వుద్దేశ్యంలో ఉమామహేశ్వర రావు గారింట్లో ట్యూషన్ కుదుర్చుకుంటాడు. అంటే అతడి నడవడికను యింత వరకు నడిపించినది పరిస్థితులు కావు. అతడి మానసిక ప్రవృత్తులు'

పోతే రంగనాయకమ్మ నడవడికకు పూర్తి బాధ్యత వహించేవి ఆమెకు ఎదురైన పరిస్థితులు. పరిస్థితులే వ్యక్తి నడవడికను తీర్చిదిద్దుతాయి అన్నది ఆస్తిత్వవాదుల వాదం — ఆమె భర్త చనిపోయాడు. వున్న ఒక్క కొడుకు చేతికి అందలేదు. ఆస్తి వుంది. వున్న ఆస్తిని ఎల్లా కాపాడుకోవాలో తెలియదు, తల్లితండ్రులు లేరు. వున్న ఒక్క అన్న ఎక్కడో మళయాళ దేశంలో వున్నాడు — అతడికి వ్యవహార జ్ఞానం బొత్తిగా లేదు. పైగా మధు తండ్రికి ఆమె రెండవ సంబంధం మొదట సంబంధం తీరిన ఎంతో కాలానికి రెండవ సంబంధం చేసుకున్నాడు — పెళ్ళి నాటికి ఆవిడ వయసు పాతిక సంవత్సరాలు ఆమె తన ఆస్తిని కాపాడు కోవాలి. నా అన్న దిక్కులేని ఆమెకి రంనాయకుల సహాయం స్వీకరించవలసి వచ్చింది. ఆ రకంగా పరిస్థితులకే గాక మానవ సహజమైన కోరికకి **(Instivcts)** కూడా ఆమె లొంగిపోయింది.

ఉమామహేశ్వరరావు గారింట మధుకు ఎదురైన వాతావరణం, అక్కడి మనుషుల ప్రవర్తన - వారి స్వభావం - కుసుమ — నళినీలతో పరిచయం, ఉమామహేశ్వరరావు గారి విలాస జీవితం — మోహనాంగితో అతడికి గల సంబంధం, రామచంద్రలోని డబ్బు లాలస — నళిని తల్లి తన వృద్ధాప్యాన్ని దైవ చింతనలో గడపటం — ఈ వాతావరణం ముందు ముందు కథా గమనానికి అనుకూలంగా మలచబడింది. అంటే, అక్కడ పరిచయం కావించబడిన పాత్రలు అన్నీ యిందుకు వుపకరించాయి. వారందరి స్వభావాల, వ్యవహారాల సమగ్ర ప్రభావం మధు పైనపడుతుంది. అతడుఆయింట యిద్దరమ్మాయిలను (నళిని-కుసుమ) ఒకేసారి చూడటం—ఆ చూడటం కూడా ఏ కొద్ది నిముషాల పాటో అంతలోనే వారిలో చిన్నమ్మాయిని (కుసుమ) మరవలేక పోవడం — దీనికి కారణం ఎమిటో అతడికి అర్థం కాదు. ఇద్దరినీ ఒకేసారి చూసినా అందులో ఒక్కరిపైకే మనస్సు వెళ్ళడ మేమిటి? నళినిలో లేని విశిష్టత ఎదో అతడికి కుసుమలో కనబడింది—కాని అది ఎమిటి అని తేల్చి చెప్పలేని స్థితి! — కార్య—కారణలకు ఎ మాత్రం సంబంధముండదు. ఇది అస్తిత్వ వాదులు కూడా అంగీకరించే సత్యం. ఈ పరిచయం ప్రేమగా మారటం—పెళ్ళాడాలన్న నిర్ణయానికి యిరువురు రావడం— ఒక్క సెంటిమెంటుకు అధిక ప్రాముఖ్యతను యివ్వడంవల్ల అది విఫలం కావడం కొంత కాలానికి తలవని తలంపుగా నళినీని పెళ్ళిచేసుకోవలసి రావడం ఈ సంఘటనలకు దేనికి అతడుగాని, నళిని బాధ్యులుకారు. కేవలం పరిస్థితుల ఒరవడిలో కొట్టుకుపోయే మనిషి ప్రవాహానికి అనుగుణంగా తన గతిని మార్చుకునే ప్రయత్నమే। అంటే ఇవన్నీ మధు తనంతకుతానుగా ఆలోచించి తీసుకున్న నిర్ణయాలు కావు. జీవితంలో తారసపడే కొన్ని హఠాత్సంఘటనలు వ్యక్తి జీవిత విధానాన్ని మార్చి వేస్తాయి. అయితే యిక్కడ సెంటిమెంటుకు ఎక్కువ ప్రాముఖ్యతను యివ్వడంవల్ల యిది సంపూర్ణమైన అస్తిత్వవాద రచన అని చెప్పే వీలులేకుండా పోయింది. అంటే, రెండు చేతులతో కళ్ళుమూసుకున్న కుసుమను బాహుబంధంలో బంధించటం వల్ల ఆమె బొట్టు చెరగడం—గాజులు చిట్లడం సంభవించింది. బొట్టు చెరిపి వేయడం, గాజులు పగుల గొట్టడం ఒక స్త్రీ భర్త చనిపోయినప్పుడు జరుపబడే కర్మకాండ అని అతడి అభిప్రాయం. తరతరాలుగా జీర్ణించుకుపోయిన ఈ మూఢ విశ్వాసానికి లొంగిపోయి మధు కుసుమలు ఒకరికి ఒకరు దూరం అయ్యారు. కుసుమను పెళ్ళాడితే తాను మరణిస్తానేమోనన్న భయం మధులోనూ, మధును చేసుకుంటే తల్లిలాగా తనకు కూడా వైధవ్యం ప్రాప్తిస్తుందేమోనన్న చింత కుసుమలోను కలిగాయి. ఇటువంటి సెంటిమెంటు వల్లనే వారి జీవన గమనం మారింది.

మధు నళినీని వివాహమాడవలసి వచ్చిందంటే దానికి మధు నళిని–ఉభయులూ ఏ మాత్రం బాధ్యులు కారు. రాము లమ్మ మరణంతో కృంగిపోయిన నళిని దుఃఖాన్ని చూడ లేక ఆమె మనసు మళ్ళించడానికి, దుఃఖభారంతో కృంగి పోయిన ఆమె మనసుకు ఓదార్పు కలిగించటం కోసం అతడేవో ఛలోక్తులాడాడు–ఒంటరిగా ఆమెను వదిలి వేయడం యిష్టం లేకవ్యాహాళికి వెడుదామని సూచించాడు, ఇద్దరూ గండిపేటకు వెళ్ళారు. అక్కడ వాతావరణం పరిస్థితుల ప్రోత్సాహంవలన వుభయుల మధ్య సాన్నిహిత్యం ఏర్పడింది తత్ఫలితంగా వివాహం జరిగిపోయింది.

జీవి ప్రవాహంలో కొట్టుకుపోతాడు.
పరిస్థితులు ఆ ప్రవాహాన్ని తీర్చిదిద్దుతాయి.
అస్థిత్వవాద సారం కూడా అదే–

మనిషి పుట్టుకకు ఒక అర్థంగాని, వుద్దేశ్యంగాని లేదు. అతడి పుట్టుక వల్ల ప్రపంచానికి ఒరుగుతున్నదేం లేదు.

పుట్టుక ఒక దుస్సంఘటన.
అర్థం లేకుండా పుడతాడు.
అర్థ రహితంగా జీవిస్తాడు,
తం నుంచి ఆశించినది లభ్యం కాదు.
కోరుకున్నది దొరకదు.

ఆశలు–ఆవేదనలు–నిట్టూర్పులు–నిరాశలు తప్పనిసరి

జీవితం దాని దారిన అది వెళ్తూ అందించే సుఖసౌఖ్యా లని అనుభవించడం–పరిస్థితుకు అనుగుణంగా జీవన గమ నాన్ని మార్చుకునేందుకు ప్రయత్నించడం మాత్రమే మనవంతు.

ఇక మిగత సంఘటనలు–కుసుమకు మతిభ్రమించడం నళిని గృహనిర్మాణ కార్యక్రమాన్ని చేపట్టడం–బిడ్డ కలగగానే మరణించడం అన్నీ కేవలం కథా గమనానికి మాత్రమే కల్పించబడినవి. కాగా తాను పరిస్థితులకు బానిస జీవిత ప్రవాహంలో తను ఎటుకొట్టుకు పోతున్నాడో తెలియక పూచిక పుల్లకు మల్లే ఆ ప్రవాహానికి తననుతాను అర్పించు కుంటున్నాను అన్న మధు హృదయ గత అనుభూతిని మరింతతీవ్రతరం చేయడానికి ఒక రకంగా వుపకరించాయి.

**డా॥ జి. ఉషా లావణ్య,**
లెక్చరర్, పి.జి. కాంప్లెక్స్.
ద.భా.హిం ప్ర. సభ,
ఖైరతాబాద్,
హైదరాబాద్–4.




## భరత బాల

రచన : ఆలా నాగేశ్వరరావు
ప్రతులకు : రచయిత పేర
జిల్లాపరిషత్ వీధి
నరసింహారావు పేట
ఏలూరు-534 006
మూల్యము. 2రు.

జీవితం బాల్య, కౌమార, యౌవన, గృహస్థ వాన ప్రస్థాద్యవస్థల కలయిక. వీనిలో బాల్యమన్నది-తక్కిన అన్నింటికన్నా అతి మధురము, అతి సుందరము. అత్యానందకరమైనది. బోసి నవ్వుల పసిపాపలను చూచి పులకించని మనసు వుండదేమో ! అంతేకాదు బాల్యానికి అంతకుమించిన ప్రత్యేకత మరొకటి వుంది. రమ్యమయిన, దృఢమయిన జీవిత సౌధ నిర్మాణానికి బాల్యమొక పునాది వంటిది. చిన్నతనములో నేర్చిన విద్యయేదయినా, వారి మనసులలో శాశ్వతంగా నిలిచిపోతుంది. బాల్యంలో పిల్లల నడవడినిచూచి భవిష్యత్తులో వారెలాంటివారవుతారో వూహించవచ్చు అందుకే చిన్నతనంలోనే చక్కని గుణాలు వారికి అలవరిస్తే- వారు సత్ప్రవర్తనులవుతారు. మన పూర్వీకులు యేనాడో ఈ విషయాన్ని గ్రహించారు కాబట్టే విజ్ఞానఖని అయిన భర్తృహరి మొదలు నిన్న మొన్నటి వేమన దాకా- ఎందరెందరో యీ నీతి పద్యరచన చేశారు. అదికేవలం పిల్లలకేకాదు. పెద్దవారికి యెంతో వుపయోగకరంగా వున్నాయనటంలో యేమాత్రం సందేహంలేదు.

ప్రస్తుత కృతికర్త రచించిన "భరతబాల" ముఖ్యంగా బాలబాలికలకై వ్రాయబడిన ముచ్చటయిన పుస్తకం. ఆధ్యాత్మిక సాధకులు వుపయోగించే జపమాలలోలాగా ఈ చిన్న పొత్తములో నూట యెనిమిది పద్యాలు చోటుచేసుకున్నాయి. భవ్యసుగుణ జాల భరతబాల'- అన్న మకుటంతో సరళ సుందరరీతిలో వ్రాయబడ్డ యీ పుస్తకములో జీవితానికి వుపయోగపడే అనేక నీతి సూత్రాలు, దాన ధర్మ దయాగుణములలవరచుకొనవలసిన అవసరం, స్నేహమునందనుసంచవలసిన నియమాలు భక్తిమార్గము అవలంబించుటకు మార్గములు. తదితరములయిన యెన్నో విషయాలతోపాటు, జీవన్ముక్తికోసం భగవన్నామమొక్కటే సరయినమార్గమనే తత్త్వబోధన కూడా వుంది. కేవల వ్యక్తిబోధనలేగాక, బాలురు సత్పౌరులుగా రూపొందటానికి వలసిన దేశభక్తి, మానవసేవ గురించి కూడా యీ పుస్తకంలో చోటు చేసుకున్నాయి.

మానవాళిసేవ పూనుకొనెడి వాడు
జాతి మతము ధనము సరకు గొనక
ప్రజలతోడగలిసి పనిచేయవలెనురా !
భవ్య సుగుణజాల ! భరతబాల :—

గురుభక్తి. శ్రమశక్తి, నిత్యతుష్టివంటి గుణాలు బాలురకెంతయినా అవసరం. చిట్టిపొట్టి మాటలతో

అక్కడక్కడ చక్కని సామెతలతో తేటతెనుగులో వ్రాయబడిన యీ పుస్తకం ఆఖరి పద్యంతో కొత్త కాంతులను సంతరించుకుంది.

భాషవేరెయైన భావంబు లొక్కచే
మతము వేరెయైనా మతములొకటే,
పథము వేరెయైనా పరమార్థమొక్క చే,
భవ్యసుగుణజాల; భరతబాల !

కరుణ శ్రీ మధునా పంతులవంటివారి ఆశీస్సులను అందుకున్న యీ పుస్తకం నిజంగా చిన్నపిల్లలకు చక్కని కానుక.

—×—

# "కల్కి"

ఆంగ్లమూలం : గురుబ్రహ్మస్వామి జగదీశ్వరానంద

తెలుగుసేత : హరిమృత్యుంజయ శర్మ

ధర : 5రు.

ప్రతులకు : హరిమృత్యుంజయశర్మ
లలితా ప్రింటింగ్ అండ్
బైండింగ్ వర్క్స్
1-1-1167/6/112 తిలక్‌నగర్,
హైదరాబాద్ - 500 044.

ధర్మానికి హాని కలిగినపుడు భగవంతుడు యేదో ఒక రూపంలో పృథ్వీపై అవతరించి, దుష్టశిక్షణ-శిష్ట రక్షణ చేసి ధర్మస్థాపన చేయడమన్నది సర్వవిదితం. ఆ పరమాత్మని పది అవతారాలలోనూ చివరిదిగా చెప్పబడే కల్కి అవతారావిర్భావం గురించి యెన్నెన్నో విషయాలు, వివిధ పురాణాల్లో వుట్టంకించ బడ్డాయి. నిజానికి భగవదు పాసనలో ఒక ఉన్నత స్థితిని పొందిన తాత్త్విక జ్ఞానపరులకు భూత భవిష్య ద్వర్తమానాలు రైలుపట్టాలపై నిలిచిన వారికిలా స్పష్టంగా దృగోచరమవుతాయట ! అటువంటివారి 'వాణి' యేనాటికీ వృధాగాపోదు. విశిష్ట భారతదేశ సంస్కృతీ సౌరభాలను వేదపురాణాలలో పొందుపర చిన మహనీయులందరూ యీ కోవకు చెందినవారే ! వారి ఆ సామర్థ్యానికి నాటి యుగలక్షణాలు కూడా కొంతఉపకరించి వుండవచ్చు పోనుపోను ఒకేపాదంతో ధర్మం నడుస్తున్న యీ రోజులలో అటువంటి చైతన్య మూర్తులు నూటికి కోటికి ఒకరుగా ఆవిర్భవిస్తున్నారు. మన కనులముందే. తమ ప్రతిభాకాంతులను వెదజల్లు తున్నా తెలుసుకోలేక కలియుగ సాధారణమైన అనభి జ్ఞతతో అలక్ష్యంచేసే మన అతితెలివిని యేవిధంగానూ సమర్థించుకోలేమనుకోండి, అది విషయాంతరం.

ప్రకృతి విషయం కలియుగంతో భగవత్ శక్తిని గురించి నిరంతర కృషి సలిపి భగవదను భూతిని గూడా పొందగలిగిన తత్త్వవేత్తలలో శ్రీ రామకృష్ణ పరమహంసకూడా ఒకరు. వారి అనుభవాలను కూడా పొందు పరచడం యీ గ్రంథం ప్రత్యేకత.

బేలూరు శ్రీ రామకృష్ణ ధర్మచక్ర మతపూర్వా ధ్యక్షులు శ్రీ స్వామి జగదీశ్వరానందులచే ఆంగ్లములో వ్రాయబడిన యీ పూస్తకము శ్రీహరి మృత్యుంజయ శర్మ గారిచే తెలుగులోకి అనువదించబడింది. పూజ్య సన్యాసిని మహాగౌరీ సరస్వతీ మాతకు అంకిత మివ్వ బడింది.

కల్కి అవతారమును గురించిన అనేక ఆసక్తికర విషయాలు యీగ్రంథంలో ఉట్టంకించబడ్డాయి. పశ్చిమ బెంగాల్‌లో మొదలై, యావత్ భారతదేశాన్నీ ఆవ రించనున్న యీ కల్కి వుద్యమము యావత్ప్రపంచ దృష్టినీ ఆకర్షిస్తుందట ! అంతేకాదు. అతి సమీప భవి ష్యత్తు అనగా 1985లో కల్కి అవతారావిర్భావమవు తుందనీ. భగవంతుని సఖులు సన్నిహితులు, సలహా దారులూ, సహధర్మ చారిణులూ సకల బంధుకోటీ భారత దేశంలోని నలుమూలలా జన్మించి అంకురించి పోతున్న ఆర్షధర్మాన్ని పునః ప్రతిష్ఠింప జేయడంలో కల్కి దేవునికి తమ సహకారాన్నందివ్వ గలరని యీ

పుస్తకం చెబుతోంది. ఇవి కేవల వూహాగానాలేమోనని అనుమానం వచ్చిన పాఠకులకు శ్రీ రామకృష్ణ పరమ హంస, స్వామి జగదీశ్వరానంద మొదలైన వారి అనుభవోదాహరణలు, కొంత ఆసరాగా నిలుస్తవి. మహనీయులు తాము నమ్మిన విషయాలు యితరులకు చెప్పటమేకాదు, ఆచరించికూడా చూపుతారు. అందుకే బేలూరు ధర్మచక్రమఠములోని పూజా మందిరంలో కల్కి పరమాత్మ విగ్రహస్థాపన జరిపి, నిరంతర పూజాదికాలు చేస్తున్నారట ! ఏది ఏమయినా కల్కి అవతార విశేషాలను తెలుసుకోవాలనే జిజ్ఞాసాపరులకు యీ పుస్తకం కొంత వరకు 'మెదడుకు మేత' అని చెప్పక తప్పదు. అందుకై కేవలం 5రు. వెచ్చించడం కష్టమూ కాదు.

## నాకు దేవుని చూడాలని వుంది

(కథల సంపుటి)
రచన : రావూరి భరద్వాజ
వెల 80 రు.
ప్రతులకు : తెలుగు విద్యార్థి పబ్లికేషన్స్
మచిలీపట్టణం ఆం. ప్ర.

ఈ నాడు కథారచన అన్నది సర్వులకూ కరత లామలకం అయిపోయింది. ఈ రోజుల్లో 'కవి' లేదా రచయిత కావటానికి "ఫలానా అర్హతలు" అన్న సూత్రీకరణ లేకపోవటంతో, సాహితీ క్షేత్రంలో అనేక మంది రచయితలు వెలుస్తున్నారు. అయినా యిక్కడో మెలిక వుంది. వీరిలో కేవలం అదృష్టవశాత్తు రచయితల లిస్టులోకి యెక్కిన వారెందరు ? తమ రచనా పటిమతో సాహిత్య పీఠాలనలంకరించిన వారెందరు ? అన్నది ముఖ్యం. హృదయాన్ని కదిలించేది సాహిత్యం ఈ రచయిత చెప్పింది ఎంతనిజం ? అని ఆశ్చర్యాన్ని కలిగించేది సాహిత్యం. ఆ రచయిత మన ముందుంచిన సమస్యలు మనల్ని నిద్రయినా పోనీకుండా వెంటాడ గలిగేది సాహిత్యం ఇటువంటి సాహిత్య రచన చేసే వాళ్ల పేర్లు శాశ్వతంగా నిలిచిపోతాయి అదుగో అలాంటివారు రావూరి భరద్వాజగారు !

త్రిపురనేని సుబ్బారావు కష్టపడి ఏర్చి, కూర్చిన యీ కథాసంపుటి భరద్వాజగారి సాహితీ జీవిత పరిణామాలకు అద్దంపట్టింది.

తన 16వ యేట సాహితీ ప్రాంగణంలోకి అడుగు పెట్టిన రావూరి భరద్వాజగారు ప్రాచీన సాహిత్యాన్ని పుక్కిట పెట్టుకున్న యవ్వనాకేళి. తరువాత్తరువాత వివిధ ప్రభావాలకు లోనై, వాటినుంచి బయటపడి 'తనను తాను'గా చూసుకోవలసిన అవసరాన్ని గుర్తించటం జరిగింది. అందుకే యిందులో పొందు పరచిన కథలలోని రచనా వైవిధ్యాన్ని విశ్లేషిస్తూ రచయిత మానసిక పరిణామాలకు అద్దం పడుతూ మధ్యమధ్య చేసిన వ్యాఖ్యలు యీ సంపుటికి యెంతో అవసరమనిపిస్తాయి. పోనుపోను కథారచనలో భరద్వాజ అలవరచుకున్న పనితనమూ, నైపుణ్యమూ గమనిస్తూ వెళ్తే రచయితగా భరద్వాజగారి విశ్వరూపం విదితమవుతుంది.

నిరంతర విద్యార్థిగా సాహితీ క్షేత్రంలోకి అడుగు పెట్టిన రచయిత, చలం తాలూకు విశృంఖల జీవిత విధానాల బిగికౌగిలినుండి బయటపడి, వైజ్ఞానిక రంగ పరిధులను దాటి, మరింత విశాలమయిన మానవ హృదయ ప్రాంగణంలో ప్రవేశించి, బడుగు వర్గాల వారి వేదనను పంచుకొని, వారి శ్రమబిందువులో అప్యాయతలో భగవంతుణ్ణి చూడగలిగారు. సంపాద కీయంలో అన్నట్లుగా యీ అశాశ్వత విలువలకు అవలగా, పారమార్థిక మూల్యాలను లక్ష్యంగా పెట్టుకుని, పరమోదాత్తమయిన ఆ లక్ష్యాన్ని చేరటంకోసం మార్గాన్ని అన్వేషిస్తున్నారు యీ రచయిత. మొదలంటా చదివించగలిగే యీ పుస్తకం చివరికి హృదయాలను బరువెక్కించక మానదు. అలా అయితేనే దీని సార్థకత.

## ఉప్పునూతల కథ

రచన : కపిలవాయి లింగమూర్తి
ప్రతులకు : కె. జనార్దన రెడ్డి
దేవస్థాన కమిటీ అధ్యక్షులు, ఉప్పునూతల-509 376
అచ్చంపేట తాలూకా. వెల 8రు.

మనదేశంలో యెన్నో సుప్రసిద్ధ తీర్థ క్షేత్రాలున్నాయి. వాటికి ఘనంగా చెప్పుకోదగిన చరిత్రలు కూడా వున్నాయి. మన ప్రాచీన సాహిత్యంలో యిలాంటి క్షేత్ర మహిమను తెలిపే గ్రథాలూ యెన్నో వెలిశాయి.

పోనుపోను యాంత్రిక జీవితానికి అలవాటుపడి యీ క్షేత్రాలను గురించి దాదాపు మరిచిపోతున్న యీ రోజులలో ఉప్పునూతల కథవంటి పుస్తకాలు రాబోయే తరాలవారికి మన ఆధ్యాత్మిక సంపదను తెలిపేందుకు యెంతయినా వుపకరిస్తాయి. ఇలాంటి రచనలలో చేయి తిరిగిన 'కపిలవాయి లింగమూర్తి' గారు యీ పుస్తక కర్త. ఇలాంటి రచనలను ప్రోత్సహించే డా॥ బాల నారాయణ గారి వంటివారూ వుండాలి మరి !

క్షేత్ర సాహిత్య రచనలో కొత్తపద్ధతిని యెన్నుకొన్న యీ రచయిత యెంతో చాకచక్యంతో కథను నడిపిన తీరు ముచ్చట గొలుపుతుంది. ఎంతో ఆసక్తిగా సాగిపోయేటపుడు 49వ పేజీనుండి 64వరకూ పేజీలు కనబడక పోవటంతో ప్రాణం వుసూరు మంటుంది. బైండింగ్ సమయంలో కొంత శ్రద్ధ వహించివుంటే బాగుండు ననిపిస్తుంది.

ఏది ఏమయినా చారిత్రక విషయాలనూ, ఆనోటా యీనోటా విన్న పిట్టకథలనూ, దైవసంబంధ మయిన చరిత్రలనూ చక్కగా జోడించి పిల్లలకు వచ్చేవిధంగా వ్రాయబడిన యీ పుస్తకం చక్కని కథామాల అనటంలో సందేహం లేదు.

"కుం. పి. నాప"
శ్రీమతి నాగపద్మిని పుట్టపర్తి.
ప్లాట్ - 23 ఆనంద్ బాగ్,
మల్కాజ్ గిరి - హైదాబాద్ - 47

## మాతృ దర్శనం

రచన-కొండముది రామకృష్ణ
వెల. రు. 10-00
ప్రచురణ-శ్రీ విశ్వజననీ పరిషత్
జిల్లెళ్ళమూడి-522 114
బాపట్ల తాలూకా
గుంటూరు జిల్లా

అందరిచేత 'అమ్మ'గా పిలువబడుతూ, వాత్సల్యామృతాన్ని అందరికీ పంచిపెడుతూ విఖ్యాతిగాంచిన జిల్లెళ్లమూడి అమ్మ షష్టిపూర్తి సందర్భంగా వజ్రోత్సవ ప్రచురణగా ప్రకటించబడిన గ్రంథమిది. గ్రంథ రచయిత శ్రీ కొండముది రామకృష్ణ అమ్మభక్తుడు అమ్మసాన్నిధ్యంలో ఉంటూ అమ్మ మహిమనూ, ఆధ్యాత్మిక శక్తినీ సమగ్రంగా ఆకళింపుకున్నవారు. రామకృష్ణ గారు 1966నుండి 'మాతృశ్రీ' అనే పత్రికకు సంపాదకత్వం వహించి పత్రికను నిరంతరాయంగా నిర్వహిస్తున్నవారు. ఆ పత్రికలోని సంపాదకీయ వ్యాసాల సంకలనమే ఈ గ్రంథంగా రూపుదిద్దుకున్నది.

ఈ గ్రంథంలో అమ్మప్రభావవైభవాన్నీ, భావ సంపదనూ వెల్లడించే శీర్షికలు 60 ఉన్నాయి. శ్రీ చరణ కమలాలు, అమృతహస్తం, అమ్మకళ్ళు మహిమలు, ఈశ్వరత్వవిధాయిని, అమ్మవాక్కు, వాక్శుద్ధి రోగికూడా నారాయణుడే, నూతన శబ్దప్రయోగం, సర్వశక్తిమత్వం, పరమదయాళువు, సర్వత్రానురాగం మాతృప్రేమ మొదలైన శీర్షికలు అమ్మమహిమనూ, ఉదాత్తతను, ఉదారతనూ చక్కగా విశదం చేస్తున్నవి. ప్రతిశీర్షికా అమ్మ అమృతహృదయాన్ని సాక్షాత్కరింపజేస్తూ మనకు ఏదో అవ్యక్తమాధుర్యాన్ని అందిస్తుంది అమ్మ ప్రతిమాటలోనూ, ప్రతిచర్యలోనూ మానవతాదృష్టి గోచరిస్తుంది.

అమ్మ విద్వాంసురాలు కాదు. కాని ఆమె మాటల్లో ఉదాత్తమైన తాత్త్వికభావాలు తొణికిస లాడు

తుంటాయి. ఉదాహరణకు అమ్మ పలికిన అమృత వాక్కులు కొన్ని.

ఒకరు "అమ్మా ! మీరు సాక్షాత్తు రాజరాజేశ్వరి అవతారమమ్మా" అంటే "మీరు కానిది నేనేమి కాను నాన్నా" అని అమ్మ సమాధానం. మీరుచూస్తే నేను కనపడను. నేను కనపడితే మీరు చూస్తారు." "మిమ్మల్ని చూస్తున్నానుగా మీరు దేవుడు కాకపోతే గదా" ఇంకా ఈలాంటి వాక్యాలు ఈ గ్రంథంలో కొల్లలుగా మల్లెల జల్లులుగా పరిమళిస్తూ మనను ఆనంద పులకితులను చేస్తుంటాయి.

రామకృష్ణగారు ఈ పుస్తకంలో అమ్మ సర్వజ్ఞత్వాన్ని, వాక్శుద్ధినీ చక్కగా వివరించారు. శైలిసులభ సుందరమై సాగుతూ పాఠకులకు ఉత్సుకతను కలిగిస్తుంది. ఈలాంటి ఉత్తమ గ్రంథాన్ని ప్రకటించి, అమ్మ ఔన్నత్యాన్ని లోకానికి చాటిన శ్రీ రామకృష్ణ మిక్కిలి అభినందనీయులు.

# శ్రీఆంజనేయ స్తోత్రమంజరి

ప్రకాశకులు-శ్రీ పురాపండ రాధాకృష్ణమూర్తిగారు
జయశ్రీ టాకీస్‌రోడ్డు-రాజమండ్రి-4

భారతీయ సంప్రదాయములో స్తోత్రములకు విశేషాదరణ ఉన్నది. స్తోత్ర పారాయణాదులనుష్ఠించి ఎందరెందరో ప్రయోజనములు పొందినారు. ఈ పుస్తకములో ఆంజనేయ సుప్రభాతము, స్తోత్ర, దండక సూక్తాదులు, తులసీదాసుగారి హనుమాన్ చాలీసా శ్రీరామరక్షా స్తోత్రములున్నవి.

ప్రకాశకులు 1984 జనవరినుండి 1985 జనవరిలోగా శ్రీ ఆంజనేయ స్తోత్రమంజరి లక్షప్రతులు ప్రచురించి భక్తులకు అందజేయ నిశ్చయించినారు. ఈ మహోద్యమంలో పాల్గొను భక్తులు ఆస్తికులు అన్ని వివరాలు శ్రీ ప్రకాశకులకువ్రాసి తెల్సుకోవచ్చును.

తంగిరాల

# వార్తావాహిని

## హిందీ మహావిద్యాలయము — గాంధీకొండ విజయవాడ

ది. 26-1-1984 గణతంత్ర దినోత్సవ సందర్భమున జాతీయ పతాకవందన కార్యక్రమం జరిగినది. శ్రీ పొలివరపు వెంకట సుబ్బారావుగారు జాతీయపతాక ఆవిష్కరణ చేసినారు దూరదర్శిని ప్రధాన అధికారి శ్రీ పార్థసారధిగారు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

ఆనాడు సాయంత్రము 6గంటలకు బహిరంగ సభ జరిగింది. డా॥ పి. వి. సుబ్బారావు అధ్యక్షత వహించారు. ప్రధాన అధ్యాపకులు శ్రీ చర్ల జనార్ధనస్వామి గారు స్వాగతం పలికారు. బుద్ధగయలోని సమన్వయ విద్యాపీఠపు మాజీ ప్రధాన అధ్యాపకులు శ్రీ సి. ఎచ్. సీతారామ దాసుగారు పాల్గొన్నారు. పోటీలో గెలుపొందిన వారికి బహుమతులను 1983 ఆగస్టు ప్రవేశిక పరీక్షలో పాసైనవారికి ప్రమాణ పత్రములు పంచినారు రాష్ట్రగానంతో సభ జయప్రదమయినది

## సరస్వతి హిందీ విద్యాలయం - విజయవాడ

తేది. 26-1-84న టి. రాజేంద్రప్రసాదు ఎమ్. ఏ. అధ్యక్షతన రిపబ్లిక్‌డే ఉత్సవం జరిగినది. ద. భా హిందీ ప్రచారసభ, విజయవాడ శాఖ బ్రాంచి మేనేజరుగారు శ్రీ పి. ప్రసాదరావు గారు, ఆంధ్రప్రభ సభ ఎడిటర్ శ్రీ రామచంద్రమూర్తిగారు పాల్గొనినారు. విద్యాలయ ప్రిన్సిపాల్ గారైన శ్రీమతి జయంతి పద్మావతిగారు విద్యాలయ నివేదిక సమర్పించినారు. అధ్యక్షులు విద్యార్థులకు మహుమతి ప్రదానం చేశినారు. రాష్ట్రగానంతో సభ దిగ్విజమమైనది.

## సారస్వత మిత్రమండలి వరంగల్ వారిచే "ప్రళయఘోష" ఆవిష్కరణ

26-01-1984 నాటి సాయంకాలం 5-30 గం॥లకు జిల్లా గ్రంథాలయం, హన్మకొండలో శ్రీ కనుకుంట్ల చక్రపాణి గారి "ప్రళయఘోష" కవితా సంకలనం ఆవిష్కరణోత్సవ సభను ఆచార్య శ్రీ కేతవరపు రామకోటిశాస్త్రి గారి అధ్యక్షతన సారస్వత మిత్ర మండలివారు ఏర్పాటు చేసినారు.

ద్విభాషా కవికోవిదులు, కాకతి కంఠహారంలో కమనీయ కవిశిఖామణి శ్రీ కాళోజీ రామేశ్వరరావుగారు పుస్తకావిష్కరణ కావించారు. శ్రీ టి. శ్రీరంగస్వామి గారు పుస్తక పరిచయం కావించినారు. డా॥ శ్రీ ఆర్. మాధవరావుగారు, శ్రీ కె. యన్. ఆర్. జి. ప్రసాద్ గారు శ్రీ అనుముల కృష్ణమూర్తిగారు ఉపన్యసించినారు. అధ్యక్షులు శ్రీ శీలం రాజేశంగారు సభాసదులకు కృతజ్ఞతలు తెలిపారు.

## వీడ్కోలు సభ

తేది 29-1-84సాయంత్రం 4గం॥లకు "శ్రీ వివేకానంద ఇనిస్టిట్యూట్ ఆఫ్ హిందీ" విద్యాలయంలో పి. బి. ఎన్. కళాశాల హిందీ ఆచార్యులు సి. ఎ. రామారావుగారి అధ్యక్షతన వీడ్కోలు సభ జరిగింది. కె. సీతారామయ్యగారు సభకు ప్రధాన వక్తలుగానున్నారు. విద్యాలయ ప్రిన్సిపాల్ శ్రీ ఎన్. వెంకట రామాంజనేయులు గారు నివేదిక సమర్పించినారు. విద్యాలయ విద్యార్థులు హిందీలోనే ఉపన్యసించి సభికులను ఆశ్చర్య పరచినారు. జాతీయగీతంతో సభ ముగిసినది.

# FORM No. IV

(See Rule 8)

| | |
|---|---|
| 1. Place of Publication | Hyderabad. |
| 2. Periodicity of its Publication | Monthly |
| 3. Printer's Name | V. Radhakrishna Murthy<br>DBHP Sabha-Andhra |
| (Whether citizen of India) | Yes |
| (if Foreinger, State the country of origin) | — |
| Address | DBHP Sabha-Andhra,<br>Khairatabad. Hyderabad-500 004. |
| 4. Publisher's Name | V. Radhakrishna Murthy |
| (Whether citizen of India) | Yes |
| (if foreigner, state the country of origin) | — |
| Address | DBHP Sabha-Andhra.<br>Khairatabad, Hyderabad-500 004. |
| 5. Editor's Name | V. Radhakrishna Murthy |
| (Whether citizen of India) | Yes |
| (If foreigner, state the country of origin) | — |
| Address | DBHP Sabha-Andhra,<br>KhairatabadeHyderabad-500 004. |
| Name and addresses of individuals who own the newspaper and partners or share holders holding more one per cent of the total capital. | Dakshin Bharath Hindi Pracher Sahha-Andhra,<br>Khairatabad, Hyderabad-500 004. |

I, V. Radhakrishna Murthy hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Dt. 1-3-1984

(Sd-) V. Radhakrishna Murthy,
Signature of Publisher



వాణీ హిందీ విద్యాలయము, విజయనగరం సప్తమ వార్షికోత్సవ
సందర్భమున తీయబడిన ఛాయాచిత్రం.

శ్రీ వి. ఆర్. చంద్రశేఖర్ (దక్షిణ భారత హిందీ ప్రచారసభ, మద్రాసు) గారిని దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర కార్యకర్తలు, కర్మచారులు తేది. 26-2-84 నాడు సన్మానము గావించిరి. ఆసందర్భమున తీయబడిన ఛాయాచిత్రము.

**Edited, Printed and Pablised** by V. Radhakrishna Murty, on behalf of the **D**. B. Hind **Prachar** Sabha-Andhra, 959, Khairatabad, Hyderabad 500 004.
**and Printedes** Dakshina Bharat Press, Hyderabad-500 004.